





అందువల్లనే ఆవిడ చేసిన తప్పులే మళ్ళీ మళ్ళీ చేసేది! అసలు ఆవిడకు చెబితేనే చేసిన తప్పుని మళ్ళీ చేసే అలవాటుంది. ఇంక చెప్పకపోతే ...

మరోసారి — తింటూ తింటూనే సత్యవతమ్మ సోదిని భరించలేని ఆయన కంచం ఎత్తి గోడకేసి రక్కున కొట్టారు! ఖంగున తగిలి — అన్నం గదంతా జల్లుకుని — నానా రభసగానూ అయింది.

అలాగ జరుగుతూన్నపుడు తారకు గుండె రైలు వేగాన్ని మించి టకటకా కొట్టుకునేది. తన గదిలోనే బిక్కు బిక్కుమంటూ ఉండిపోయేది!

ఇంట్లో జరిగే ఈ గొడవలు వెంకటరత్నానికి తెలిసేవికావు! అతనికి ఈ మధ్య క్రొత్త క్రొత్త పనులు ఎక్కువైనాయి! రాత్రిపూట ఏడు, ఏడున్నరకల్లా ఇంటికి వచ్చేసేవాడు! అన్నం తినేసి మళ్ళీ ఎనిమిదికల్లా వెళ్ళిపోయేవాడు! ఇహ అర్ధరాత్రి దాటాక ఏ రెండింటికో వచ్చి పడుకునేవాడు!

ఇది తారకు ఎంతో కష్టంగా ఉన్నది. అతను రాకముందు ... ఎదురుచూస్తూ కూర్చున్నపుడు ... రాగానే ఖచ్చితంగా అడిగేయాలనుకునేది! తీరా అతడు దగ్గరగా వచ్చి తారను అపురూపంగా కౌగిట్లోకి తీసుకునేసరికి అన్నింటినీ మర్చిపోయి ఆ చేతుల మధ్య ప్రశాంతంగా సేదతీరేది! ఆ బలమైన కౌగిట్లో ఉంటే తారకు ఏదీ తెలియదు! ఏమీ గుర్తుండదు! అసలు ఆలోచనే ఉండదు! నిజం చెప్పాలంటే ఆమె తనువూ, మనసూ — ఆ సమయంలో వాటి ఉనికినే కోల్పోయినట్లుగా, స్పృహ లేనట్లుగా — పసిపిల్ల తల్లి ఒడిలో దూరి అన్నిభయాలూ మాని హాయిగా నిద్రపోతున్నట్లుగా— తార అతని చేతుల మధ్య నిశ్చింతగా ఒదిగిపోతుంది.

* * *

'ఉన్నవాడు తింటూ కూచుంటే దేశం బాగుపడిపోదు! దేశమంటే మట్టికాదోయ్! మనుషులోయ్!' అన్నాడు గురజాడ. ఆ మనుషులంతా నిలబడి 'ఇది నా దేశం!' అని ఎలుగెత్తి చాటి చెప్పుకోవాలంటే వాడికి ముందర కడుపు నిండాలి! అ కడుపు నిండటానికి ఉన్నవాడి దగ్గర బూజు పడుతూన్న డబ్బునంతా బయటకులాగి పదిమందికీ పంచాలి! 'నువ్వు తిను! పదిమందికీ పెట్టు! అంతేగానీ దాచటమెందుకు' అంటాడు వెంకటరత్నం.

"ఇది నా డబ్బు! నే దాచుకుంటాను. అడగటానికి నువ్వెవరు?" అంటాడు ఉన్నవాడు.

ఛ్రుమంటాడు వెంకటరత్నం.

"నీ డబ్బా! నువ్వు అచ్చువేసావా? కూలిచేసి నువ్వు సంపాదించావా? పంటలు నువ్వు పండించావా? వీళ్ళు...ఇరుగో—ఈ కడుపులు మాడ్చుకుంటూన్న... ఛా! ఛా! వాళ్ళ కడుపులు వాళ్ళు మాడ్చుకోవటమేమిటి! నువ్వు—నువ్వు మాడుస్తున్నావు! అవును! నువ్వు ఎవరి కడుపులు మాడ్చి దాచుకుంటున్నావో— వాళ్ళు! వాళ్ళేనయ్యా నీకు సంపాదించి పెడుతున్నాది! మళ్ళీ చెబుతున్నాను. మర్యాదగా ఆ డబ్బు తీసి పదిమందికీ పంచు!" అంటాడు వెంకటరత్నం.

వెర్రివాడ్ని చూసి నవ్వినట్లుగా నవ్వుతాడు. "అడ్డమైన వెధవలందరకూ పంచటానికా నా డబ్బుని ..." వాడి మాటకూడా పాపం పూర్తి కాదు. రుద్రుడయ్యేవాడు వెంకటరత్నం.

"టట్! అడ్డమైనవాడా! ఎవడ్రా అడ్డమైనవాడు! ఆ అడ్డమైనవాడు కష్టపడితేనేకదరా నీ గాదె నింపుకుని నువ్వు నిలువుగా నించున్నావు! ఆ అడ్డమైనవాడి ప్రతి రక్తపు బొట్టూ నీ ప్రతి పైసాలోనూ ఉందిరా! ఆ అడ్డమైనవాడి చెమటతోనే తడిసి నీ పంట పడిందిరా! వాడుకూడా నీలాగానే ప్రతి అడ్డగాడిద పొలంలోనూ మనమెందుకు పనిచేయాలి అని అనుకుని ఉంటే — నువ్వే పంచెను గోచిగా పెట్టుకుని పొలంలోకి దిగేవాడివి! వాడికి నీ కంటె గొప్ప మనసుంది కాబట్టి నీ పొలంలో ధాన్యాన్ని పండించిపెట్టాడు! వాడికున్నది దేహ దారుఢ్యం! అది నీకు పంచి ఇచ్చాడు! పైగా అడ్డమైనవాళ్ళా అంటూ తీసిపారేస్తావా! ప్రాణంలేని 'డబ్బు' నీదయిందిగానీ, నిన్నూ, నీ సంపాదనూ పెంచుతూన్న, ప్రాణమున్న ఈ మనుషులు మాత్రం నీ వాళ్ళు కాలేకపోయారు!"

ఇలాటి వాద ప్రతివాదనలు ఎక్కువైపోయాయి! అంతేకాకుండా "చూడూ! ఎవరైనా కొంతకాలం ఓపిక పట్టగలరు! వాళ్ళల్లో ఆ ఓపిక చావకముందే మర్యాదగా పంచి ఇవ్వు! లేదూ, వాళ్ళల్లో ఓపిక చచ్చిన్నాడు, ఆవేశం పెరిగిననాడు వాళ్ళే తీసుకుంటారు!" కేవలం మాటల రూపంలోనే కాకుండా చేతల్లో కూడా చూపెట్టేవాడు!

వెంకటరత్నం ఆలోచనలూ, అతని మాటలూ, అతని వాదనలూ, అతని కార్యక్రమాలూ — ప్రతివాడిలోనూ ఒక వింత భయాన్ని కలుగజేస్తున్నాయి!

వెంకటరత్నం ఒక్కడేకాదు! ఆలోచన తెలిసిన మరికొంతమంది యువకులు వెంకటరత్నానికి సపోర్టయ్యారు! అప్పటికే కమ్యూనిస్టు పార్టీలోని పెద్ద పెద్ద నాయకులందరకూ తలలో నాలుకలాంటివాడు వెంకటరత్నం! ఈ విప్లవ ధోరణితో, ఈ తిరుగుబాటుతో — వెంకటరత్నం కూడా ఒక ఛోటా నాయకుడైపోయాడు! నాయకవర్గాలనుంచీ అతనికి చాలా అండ లభించింది! కొన్ని సలహాలు దొరికాయి! కావలసినంత ప్రోత్సాహం! ఇంక వెంకటరత్నానికి 'అడ్డు' అనేది లేకుండా పోయింది!

ఇలాంటివి ఆషామాషీ విషయాలు కాదు! అలాటివాటికి తలలు పండిన పెద్దల ఆమోదమూ, ప్రోత్సాహమూ, అండా దొరుకుతుంటే — యువక రక్తం గోదావరి వరదలా ఉప్పొంగుతున్నాది!

* * *

సరళకు మగబిడ్డ పుట్టాడని వార్త తెచ్చాడు, తార పెద్ద తమ్ముడు రామారావు. అపుడే నాగరత్నమ్మ తారకోసంగా ఏవేవో తినుబండారాలు కూడా చేసి పంపించింది. అంతేగాకుండా "అక్కయ్యను తీసుకురమ్మన్నారు" అని కూడా చెప్పాడు.

అవును! అపుడు తారకు ఏడవ నెల జరుగుతున్నాది. ఎనిమిది ప్రవేశిస్తే మళ్ళీ 'వెళ్ళకూడదు' అంటారు!

'అమ్మో! తార వెళ్ళిపోతే ఈ చాకిరీ అంతా ఎలా?' సత్యవతమ్మ వచ్చినంత భయంగా ఉంది! బాగా సుఖపడటానికి అలవాటయిన ప్రాణాలు కష్టపడటమంటే భయంతో బిర్రబిగుసుకుపోతాయి! అయినా 'పంపను' అనటానికి వీల్లేదుగా! అందుకని తనకేం పట్టనట్లుగా ముభావంగా అన్నది — "అయ్యో! అలాగే బాబూ! చాలా సంతోషం! ఒక్క ముక్క అబ్బాయితోకూడా చెప్పి తీసుకెళ్ళు!"

## సి. హెచ్ ఎస్ – విడదవోలు

ప్రతి కన్నెపిల్ల ప్రతి మగవాడిని ప్రేమించడం, పెళ్లి అయినవాడో కాదోకూడా తెలుసుకోకుండా ప్రేమించి పెళ్లి చేసుకోవడం, చావడం చేస్తున్నారు. సినిమాలో జీవితంలో రచనలలో – ఇంతే జరుగుతున్నాయి. ఇదేనా మానవలోకం ?

★ ప్రేమించి పెళ్లి సంగతి ఎత్తేదాకా తన పెళ్లాం పిల్లల సంగతి ఎత్తని మగవాళ్లు వున్నప్పుడు కన్నెపిల్లలు ఎలా వలలో పడకుండా వుంటారు ? యీ 'ప్రేమ' వ్యాధి యువతని ఓ పిచ్చిలాగ పట్టినట్టుంది. చదువు సంధ్యలు పూర్తికాకుండా సంపాదన లేనివాడిని; సంసారం వున్నవాడిని ప్రేమించడం బాధపడడం – నిజంగా జాలిపడవలసిన విషయం. ఈ పరిస్థితికి – కారణం ఇల్లు, అక్కడి వాతావరణం. ఎదిగీ ఎదగని పిల్లల మనస్సుల్లో వికసింపచేయవలసిన నమ్మకం విశ్వాసం, అందించవలసిన రక్షణ ఆదరణ... ఎంతమంది ఇళ్ళల్లో లభ్యం అవుతోంది ? ఎంతమంది తండ్రులు – వ్యసనాలకి బానిసలై పిల్లల పరువు పబ్లిక్‌గా తీస్తున్నారో చూడడంలేదా ? ఎంతమంది తల్లులు తమ నిస్సహాయస్థితికి – ఎదురుతిరగలేక అసహ్యించుకుంటూ కాపురాలు సాగిస్తున్నారో, ఆ అలసభావం పిల్లలమీద ఎలా పడుతోందో ప్రత్యక్షంగా కన్పిస్తున్నా – ఎవరూ పట్టించుకోడంలేదే. ఇంక యుక్తవయస్కులైన పిల్లలు ఎటు తిరుగుతారు. ఓ పిడికెడు సానుభూతి, ప్రేమ దొరుకుతాయన్న చోటికి – పరుగులు తీస్తున్నారు. దీపంపురుగుల్లా రెక్కలు కాల్చుకుంటున్నారు. ముందు -- యిల్లు చక్కదిద్దుకోడమే – మనం చేయవలసినది–మిగిలినవి తాత్కాలికాలు.

## జి వి ఆర్ – విశాఖపట్నం

మంచి చేసినా చెడు చేసినా ఎందుకంతగా చెప్పుకుంటారు ?

★ అందరూ ఎందుకు చెప్పుకుంటారు ? మంచి చేసినవాళ్లు చెప్పుకుంటే – చెడు చేసేవాళ్లూ చెప్పుకుంటారు – పైవాళ్ల గురించి !




## కె బి – తిరువూరు

ఈ రోజుల్లో సినిమాలలో శృంగారం చూపిస్తున్నారు. స్త్రీకి విలువ లేకుండా చేస్తున్నారు. పూర్వపు స్త్రీకి విలువ వుండేది...

★ ఏంచేస్తారు ? మీ ప్రేక్షకులు కవాలన్నది అందివ్వడమే తమ ధర్మంగా భావిస్తారు నిర్మాతలు. ఈ రోజు శకుంతల తీసినా దుష్యంతుడు కణ్వాశ్రమం అంతా కలయతొక్కుతాడు – కాశ్మీరు దాకా ! శకుంతలా గిలగిల తన్నుకుంటుంది – హీరోగారి స్టెప్పులకి అనుగుణంగా !... ఇక స్త్రీకి విలువ అంటారా ? అది ఏ కాలంలోనైనాసరే – ఆ కాలపు సమాజం ఇచ్చినంతే వుంటుంది. ఇది పూర్తిగా పురుష ప్రపంచం. అందుకే వారి యిష్టాయిష్టాల మీదే ఆధారపడి – వస్తాయి సినిమాల్లో స్త్రీల శృంగార చేష్టలు !... మహిళలు మెచ్చిన చిత్రాలంటారేగాని – వారు మెచ్చేవీ అంగాంగ ప్రదర్శనలు కావు – అంతర్లీనంగా వుండే – సెంటిమెంట్సు. అవి ఆకట్టుకొంటే – వాటికోసం మిగిలిన రొట్ట భరిస్తారు !

## ఎం ఎస్. ఆర్ – బైపల్లి

జీవితకాలంలో మానవుడు నటించవలసిన కాలమే ఎక్కువ అనుకుంటాను ?

★ నిజమే. అసలు ముఖం చూపిస్తే సమాజంలో నెగ్గుకురావడం కష్టం.

## రాము, రమణ – ఇండోర్

ప్రేమించి మోసం చేసేది ఒకరే అయితే ఈ లోకంలో అంతా మోసమేనని భగ్నహృదయం బాధపడక తప్పదు అంటాను నేను ?

★ ప్రేమ పచ్చకామెర్ల వ్యాధిలాంటిది ప్రేమించిన వాడికి లోకం అంతా ప్రేమమయంగా కన్పిస్తుంది. లేదా మోసపోయినవాడికి లోకం అంతా మోసంగా కన్పిస్తుంది !

## సాయి – విజయవాడ

సెన్సారులో చేరి మొదట అబ్జక్షన్ రైజ్ చేసినప్పుడు ఎలాంటి ప్రతిఘటనను ఎదుర్కొన్నారు ?

★ అందరి అబ్జక్షన్ – రియాక్షన్ ఒక్కలాగే వుండేది. కాని కాలం మారింది. ఇప్పుడు అంతా కాకపోయినా కొందరేనా అబ్జక్షన్స్‌కి అతీతులైపోయారు ! మరికొందరు 'కత్తిరించడం దేనికి ? "ఏ" ఇచ్చి వూరుకుంటే సరి' అనేస్తున్నారు – అక్కడికి హింస 'ఏ' లో వున్నా తప్పులేదన్నట్టు !! మొత్తానికి స్తబ్దతలో–దూలాలు తేలిపోతున్నాయి. పూచికపుల్లలు అడ్డుపడుతున్నాయి !! అంతే.

## ఎస్ బి ఆర్ – విజయనగరం

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. నా దగ్గిర నుంచి పుస్తకాలు తీసుకెళ్లేది. వాటిపై ఆమె పేర్లు రాసికూడా పంపేది. రోజు ఒకరికోసం ఒకరు ఎదురుచూసేవారిమి. నేను ఒకరోజు ఐ లౌ యూ అని వ్రాసితిని. అప్పటినుంచీ ఆమె పుస్తకాలకు రావడం మానేసింది. నన్నేం చేయమంటారు ?

★ ఇంకో అమ్మాయికి విసరండి వల ! కొందరికి యీ పేర్లు ఎక్కడపడితే అక్కడ గిరికే జబ్బు వుంటుంది. అయినా పరాయివాళ్ల పుస్తకాల మీద తన పేరు రాస్తూంటే సభ్యత తెలియని పిల్ల అనుకోవాలేగాని – ప్రేమించిందనేలా అనుకున్నావయ్యా బాబూ ! ప్రేమంటే ఏమిటి ? – ఇలా పుస్తకంమీద పేరు రాయడమటుకు కాదు. కాస్త ఎదగండి – వయస్సులో కాదు; మనస్సులో ●

---

ఆమాత్రం మాట్లాడినందుకు తార సంతోషపడింది !

తార మనస్తత్వమే వేరు ! ఆమె భావాలు చాలా చిత్రంగా ఉంటాయి ! మన ఇంట్లో మనం ఎలా ఉన్నా ఫర్వాలేదు ! పైగా మనం ఇవ్వాళ ఒక మాట అనుకున్నా రేపటికి మర్చిపోతాం ! ఇవ్వాల్టి కోపం రేపటికి ఉండదు ! అది మానవ సహజం ! మన పిల్లల్ని మనం ఏదో కోపంలో ఎన్నో తిడతాం! కొడతాం! అంతేగానీ వాళ్ళు మనకేమైనా శత్రువులా! వెంటనే మళ్ళీ అన్నీ మర్చిపోయి దగ్గరకు తీసుకుని లాలించుతాము ! అవి అందరి ఇళ్ళల్లో ఉండే అతి సహజమైన అనుభవాలే ! పిల్లలైనా అంతే ! పెద్దవాళ్ళమైనా అంతే ! ప్రతి ఇంటికీ గడప ఉన్నట్లే సమస్య లేని ఇల్లూ ఉండదు ! కోపతాపాలు లేని మనిషీ ఉండడు ! కానీ – బయటి మనుషులు మన ఇంటికి వచ్చినపుడు మనదగ్గర గంటో,

## తార

అరగంటో కూర్చుని వెళ్ళిపోతారు ! ఆ సమయంలో వాళ్ళంటే మర్యాదగా ఉండాలి ! అంతేకాదు, మన యింట్లో లక్షాతొంభై గొడవలుండనీ ! వాటిల్లో ఏ ఒక్కటీకూడా వాళ్ళ ముందర బయటపెట్టకుండా జాగ్రత్తగా దాచుకోవాలి ! ఎందుకంటే అలాటివి మనకు పాత అనుభవాలు ! కాని, క్రొత్తవాళ్ళకు క్రొత్త ! అదొక వింత ! దాన్నిగూర్చి వాళ్ళు మళ్ళీ జన్మలో కూడా మర్చిపోరు ! కాస్తంత అయిన ఆ విషయం ఎంత అసహ్యంగా చిత్రించబడుతుందో ఊహాకే అసాధ్యం ! అందుకే తారకు ఇంటికి ఎవరైనా వస్తున్నారంటే భయం ! సత్యవతమ్మకు గుట్టూ, మట్టూ ఏమీ ఉండవు ! ప్రతి చిన్న విషయమూ ఎంతో పెద్దదిగా ఊహించి గోరంతను కొండంతగా చేసి కబుర్లు చెబుతుంది ! అలాటినేమీ జరగకుండా ఆ వచ్చినవాళ్ళు వెళ్ళిపోయే క్షణం కోసం ఊపిరి బిగపట్టి మరీ ఎదురు చూస్తుంటుంది. అందుకే అత్తగారు ఇంకే పురాణమూ విప్పకుండా ఆ నాలుగు ముక్కలే మాట్లాడి ముగించినందుకు ఎంతో సంతోషపడింది.

వెంకటరత్నం అనుమతినీ, వెంకట్రామయ్యగారి అనుమతినీకూడా పొందిన తార సంతోషంగా పుట్టింటికి ప్రయాణమయింది.

* * *

అమ్మా, నాన్న, తమ్ముళ్ళు, సరళ – అందర్నీ చూసిన తార వారం రోజులపాటు మూజెల్లనూ, అక్కడి మనుష్యులనూ – అందర్నీ మర్చిపోయింది.

ఆప్యాయతలతో, అనురాగాలతో, హాస్యోక్తులతో, సరళ కొడుకుతో – రోజులు చాలా స్పీడుగా దొర్లిపోతున్నాయి !

(ఇంకా వుంది)




# ఈ తరం అమ్మాయి

శ్రీమతి లక్ష్మీ గిరిబాబు

ఉష కారు స్టార్టు చెయ్యబోతుండగా పనిమనిషి రంగయ్య పరిగెత్తుకుంటూ వచ్చి, "అమ్మగారు పిలుస్తున్నారమ్మా" అని చెప్పాడు.

ఉష వినుక్కుంటూ కారు దిగి యింట్లోకి వెళ్లింది.

"ఎక్కడికి వెళుతున్నావు ?" కోపంగా అడిగింది మాలినీదేవి.

"కాలేజీకి" అంది ఉష నవ్వుతూ.

"నీకేమైనా మతిపోయిందా ? ఈ రోజు పన్నెండు గంటలకి నిన్ను చూసుకోడానికి రఘునాథ రావుగారు వాళ్ల అబ్బాయి చక్రవర్తితో వస్తుంటే నువ్వు కాలేజికి వెళతావా ?"

"నో మమ్మీ, వాళ్ళు వచ్చేది పన్నెండు గంటలకి గదా ? ఈ రోజు ఫస్టవర్ ఎకనమిక్స్. వెరీ యింటరెస్టింగ్ సబ్జెక్ట్. అదయిపోగానే వచ్చేస్తాను..."

"అలా వీల్లేదు. ఒక్క పిల్లవి గదాని బాగా గారాబంగా పెంచడం పెద్ద తప్పయింది. ఈ రోజు నువ్వు పెళ్లిచూపు అయ్యేంతవరకూ బయటికి వెళ్లడానికి వీల్లేదు. బుద్ధిగా యింట్లో కూర్చో. ఆ బెల్‌బాటమ్ ప్యాంటూ, ఆ షర్టూ తీసెయ్. నేను సెలెక్ట్ చేసిన చీర కట్టుకొని బుద్ధిగా నేను చెప్పినట్టు చెయ్యి." సాధ్యమైనంత కోపంగా చెప్పి లోపలికి వెళ్లిపోయింది మాలినీదేవి.

ఉష పుస్తకాలు విసుగ్గా టేబుల్‌మీద పడేసి తల పట్టుకొని సోఫాలో కూర్చుంది. అసలు తనకి ఏమంత వయసు వచ్చిందని పెళ్లికి యింత తొందర? కాలేజ్ బ్యూటీగా పేరుపొందిన తనకు, అపర కుబేరుడికి ఏకైక కూతురయిన తనకు—కావాలంటే కొన్నివేలమంది వచ్చి క్యూలో నిలబడరూ ? ఆవేమంటే, చక్రవర్తి ఫారిన్ రిటర్న్‌డ్ డాక్టరట. ఆయనా తనలాగే అపరకుబేరుడికి ఏకైక కొడుకట. అందువల్ల యింతకన్నా మంచి సంబంధం యీ జన్మకి తనకి దొరకదట .. ఛీ... అయినా, ఫారిన్ నుంచి వచ్చిన మనిషికి కూడా పెళ్లిచూపుల పేరుతో ఒక అమ్మాయిని 'హర్ట్' చెయ్యడం ఏమిటో ? అబ్బాయిగారు తనని యింటర్వ్యూ చేస్తారులాగుంది. అయినా యితని గురించి తన కాలేజి...

ఉష ఫోనెత్తి రింగ్ చేసింది. "హలో, రజనీ, నేను — ఉషని. ఈ రోజు కాలేజికి రావడంలేదు" అంది నీరసంగా.

"వై ? ఏమైనా కడుపునొప్పా ?" అంది రజని.

"అంతకన్నా పెద్దది — పెళ్లిచూపులు !"

"నీకా ? అయ్యబాబోయ్ !" అదిరిపడింది రజని.

"అవునే. నాకు బోర్ కొడుతోంది."

"పారిపోయి వచ్చెయ్యకపోయావా ?"

"నో యూజ్. చాల కట్టుదిట్టాలు చేశారు అసలు పెళ్లిచూపుల విషయం కూడా ఒక అరగంట కిందే చెప్పారు. అన్ని విషయాలూ పర్సనల్‌గా మాట్లాడుకుందామని బయలుదేరబోతుంటే, మమ్మీ నా కాళ్ళు కట్టిపడేసింది."

"కాళ్ళు కట్టేశారా ?"

"తాళ్లతో కాదనుకో — మాటల్తో."

"హాయ్, ఉషా ! ఇంతకీ ఎవరట ఆయన ?" అది జయ కంఠం.

"నువ్వు కూడా అక్కడే వున్నావా, జయా ? చూడవే నాకు ... "

"అది సర్లేగానీ, అతని గురించి చెప్పవే బాబూ."

"అమెరికన్ డాక్టర్‌గారట."

"ఓ, వెరీ స్వీట్. కాని, పెళ్లిచూపులూ, గిల్లిచూపులూ లేకుండా, మీ ఫైవ్‌స్టార్ హోటల్లో అతన్ని పార్టీకి పిలిచి, అక్కడే పరిచయాలు చేసెయ్యకూడదూ ?" అంది జయ.

"చెప్పాను కాని, డాడీ ఒప్పుకోలేదు. అంతా సాంప్రదాయసిద్ధంగా జరగాలట" అంది ఉష నీరసంగా.

"పెళ్లిచూపులంటే జీవితంలో అతి భయంకరమైన సంఘటన. మాలాంటి వాళ్లకే కళ్ల నీళ్లు పడతాయి. సున్నితంగా, గారాబంగా పెరిగిన నీలాంటి వాళ్ళు తట్టుకోలేరు. ఎలా చేస్తావే తల్లీ !" అంది జయ సానుభూతిగా.

"అదేనే నాకు కూడా భయంగా వుంది పెళ్లిచూపుల గురించి చాల చాల విన్నాను. అందుకే







నాకు పెళ్ళిచూపులంటే అసహ్యం. కాని, ఏం చెయ్యను ?'' అంది ఉష.

''గంగిరెద్దులా తయారయి, బజారులో అమ్మకానికి నిలబెట్టిన గేదెలాగ నిలబడవద్దు కాస్త అమెరికన్ డాక్టర్ని ఓ ఆట పట్టించు.''

''నా సంగతి నీకు తెలుసుగా. మరి వుంటా. మమ్మీ విన్నదంటే నన్ను మర్డర్ చేస్తుంది ఈవెనింగ్ రజని యింటికి వస్తాను'' అని ఫోన్ పెట్టేసింది ఉష.

*  *  *

''ఉషా, కాఫీ పట్టుకొని రా'' అంటూ ట్రే చేతికిచ్చింది మాలినీదేవి.

ఉష ట్రే పట్టుకొంటుండగా, ''చూడమ్మా, తలవంచుకొనే వుండాలి. ట్రే టీపాయ్‌మీద పెట్టు. వాళ్ళు కూర్చోమన్న తర్వాత నా పక్కన సోఫాలో కూర్చో వాళ్ళడిగిన ప్రశ్నలన్నిటికీ తలవంచుకొని, మర్యాదగ జవాబులు చెప్పు'' అని హాల్లోకి వెళ్ళిపోయింది మాలినీదేవి. ఆవిడ ఉషకి అటువంటి జాగ్రత్తలు చెప్పడం అది పదవసారి.

ట్రే చేతుల్తో పట్టుకొని నడుస్తుంటే, ఉషకి కాస్త కాళ్ళు వణికినట్లనిపించింది. ఎవరినీ ఎప్పుడూ కేర్ చెయ్యని తనకి కాళ్ళు వణకడం ఆశ్చర్యమనిపించింది. ధైర్యం కూడదీసికొని వెళ్ళి ట్రే టీపాయ్‌మీద వుంచింది.

సుమారు అయిదడుగులా ఆరంగుళాల ఎత్తు, ఎచ్చటి ఆరోగ్యకరమైన శరీరంతో మెరుపుతీగెలా వున్న ఉషని చూడగానే చక్రవర్తికి మతిపోయినట్లయింది

''కూర్చోమ్మా'' అన్నారు రఘునాధరావుగారు.

తల్లి ప్రక్కనే సోఫాలో కూర్చుంది ఉష. కాని, తల్లి చెప్పినట్లు తలవంచుదామనుకున్నా వీలుకాలేదు. చక్రవర్తికేసి చూసింది. అతని కళ్ళు చురుగ్గా నవ్వుతున్నాయి. మనిషి హుందాగా, ఇంగ్లీషు సినిమాలో హీరోలా వున్నాడు అనుకుంది ఉష.

చక్రవర్తినీ, ఉషనీ పరీక్షగా చూసిన మాలినీదేవికి యిద్దరికీ ఒకరికొకరు నచ్చినట్లు అర్థమయింది భర్త జానకిరావ్‌కేసి నవ్వుతూ చూసింది

జానకీరావ్ నవ్వి, ''బాబూ, అమ్మాయితో ఏమైనా మాట్లాడాలంటే మాట్లాడవచ్చు''

# ఈతరం అమ్మాయి

అన్నారు.

చక్రవర్తి తేరుకొని, ''మీ పేరు చెబుతారా ? అఫ్‌కోర్స్ మీ పేరు తెలుసనుకోండి. అయినా మీ నోటితోటే వినాలని... శంఖంలో పోస్తేనేగాని తీర్థం కాదంటారుగదా మనవాళ్ళు ?'' అన్నాడు నవ్వుతూ.

''ఉషారాణి'' అంది ఉష. ఆ కంఠంలో కోటి వీణారావాలు వినిపించాయి చక్రవర్తికి.

''నా పేరు చక్రవర్తి. మీ గురించి అన్ని వివరాలూ నాకు మా నాన్నగారు చెప్పారు. అందువల్ల మిమ్మల్ని ఏవేవో అడిగి విసిగించాలనుకోవడంలేదు. నా గురించి కూడా మీకు అన్నీ తెలుసనుకొంటాను. ఏమైనా వివరాలు కావాలంటే అడగవచ్చు'' అన్నాడు చక్రవర్తి.

ఉష తనకి తెలియకుండానే సిగ్గుతో తలవంచుకొంది. ఉషకి యిప్పుడు సంతోషంతో గాలిలో తేలిపోతున్నట్లనిపించింది. తనకి ఎలాంటివాడు భర్తగా కావాలని కలలు కన్నదో, అంతకన్నా అన్ని విషయాల్లోనూ ఎక్కువగా వున్నాడు చక్రవర్తి. సంతోషంతో ఎగిరి గంతెయ్యాలనిపించింది. తను భయపడినట్లు పెళ్లిచూపులు భయంకరంగా కాకుండా ఎంతో హాయిగా జరుగుతున్నాయి చక్రవర్తి ఎంత మంచివాడు! ఎంతయినా అమెరికాలో చదువుకున్నవాడుగదా! సాయంత్రం తన ఫ్రెండ్స్ దగ్గర చక్రవర్తిని పొగిడెయ్యాలి..

''మరి వెళ్ళొస్తాం జానకీరావ్, ఆలో

## నాటి దాత : నేటి నేత

సహాయం చేసి
మరచేవాడు
నాటి దాత !

వాగ్దానాలు వడ్డించి
ఊరించేవాడు
నేటి నేత !

— యస్. యస్. రెడ్డి

చించుకొని, ఏ విషయం రేపు చెబుతాను'' అంటూ లేచారు రఘునాధరావుగారు. చక్రవర్తి కూడా లేచి నిలబడ్డాడు.

ఉషకి ఆ మాట వినగానే చెంపమీద చెళ్ళున కొట్టినట్లనిపించింది. ఇంకా రేపటిదాకా ఏమాలోచించాలి ? ఉష లేచి నిలబడింది. నిద్రపోతున్న ఆత్మాభిమానం తోకతొక్కిన త్రాచులా బుస కొట్టింది. సూటిగా చక్రవర్తి కళ్ళలోకి చూసింది. అతను తియ్యగా నవ్వుతూ, ''సీ యూ'' అన్నాడు. ఉష విసురుగా వెనక్కితిరిగి అక్కడి నుండి తన గదిలోకి నడిచింది.

*  *  *

ఉష సాయంత్రం రజని యింటికి వెళ్ళేసరికి రజని, జయ పోర్టికోలో కూర్చొని వున్నారు.

''వాట్ న్యూస్'' అన్నారు యిద్దరూ ఒకేసారి.

''చెప్తాను. తొందర పడకండి'' అంటూ కుర్చీలో కూర్చుంది ఉష.

''అబ్బ చెప్పవే పెద్ద సస్పెన్స్'' అంటూ ఉషని గిల్లింది జయ.

''పెళ్లికొడుకు వెరీ హ్యాండ్‌సమ్. నాకు భర్త కాదగిన అన్ని లక్షణాలూ వున్నవాడు.''

ఉష నోటినుంచి అలాంటి సమాధానం వస్తుందని వూహించని రజని, జయలకి ఆశ్చర్యపోయినంత పనయింది.

''అవునే, హి యీజ్ వెరీ హ్యాండ్‌సమ్. నైస్ మ్యాన్ కూడా. మనం అనుకొన్నట్లు పిచ్చి పిచ్చి ప్రశ్నలతో వేధించలేదు. ఒక ఫ్రెండ్‌లా ట్రీట్ చేశాడు. కాని, ఒక్క విషయంలో మాత్రం నాకు కోపం వచ్చింది ...''

''ఏమిటే ?'' అన్నారు రజని, జయ ఒక్కసారిగా.

''నేను ఆయనకి బాగా నచ్చానని ఆయన ముఖమే చెప్పింది. అలాంటప్పుడు ఆ విషయం అప్పుడే, అక్కడే చెప్పెయ్యొచ్చుగా ? చెప్పలేదు. 'రేపు ఆలోచించుకొని ఏ విషయం చెబుతా'మని తండ్రిగారంటే ఆ శ్రీరామచంద్రుడు నవ్వుతూ నిలబడ్డాడు'' అంది ఉష కసిగా.

''నేను చెప్పలేదూ ? అమెరికాలో ఆరేళ్ళున్నా ఇండియాలో ఈగలు తోలినా మగబుద్ధి మగబుద్దే. అప్పటికప్పుడే వప్పేసుకొంటే వాళ్ళకది బిలో డిగ్నిటీ. లేకపోతే, నీ విషయంలో రేపటిదాకా ఆలోచించుకోవలసింది ఏముంది ? నీలాంటి అందగత్తె అమెరికా

నుంచి ఇండియాదాకా ఒక్కత్తైనా కనిపించిందటా ఆయనకి ?'' అంది జయ కోపంగా.

''వాళ్ళు రేపటిదాకా ఆలోచించి 'యస్' అంటే అంతా అయిపోయినట్లేనన్నమాట! నీకు అతను నచ్చిందీ, లేనిదీ వాళ్ళకి అవసరం లేదా? అసలు ముందు అబ్బాయి నీకు నచ్చిందీ, లేందీ వాళ్ళు కనుక్కోవాలి. నీకు అబ్బాయి నచ్చినట్లయితే, అప్పుడు వాళ్ళు 'మేము ఆలోచించుకోవాలి' అని చెప్పవచ్చు. మరి, వాళ్ళు అలా అన్నారంటే వాళ్ల వుద్దేశ్యం అబ్బాయి అపర మన్మథుడనీ, నీ అందం మాత్రం నెమ్మదిగా ఆలోచించదగిందనేగా అర్థం?'' అంది రజని కూడా కోపంగా.

వాళ్ళ మాటలతో ఉషకి కోపం కట్టలు తెంచుకుంది. ''మీరు చెప్పింది నిజమేనే. వాళ్ళు 'ఆలోచించి రేపు చెబుతా'మంటే నేను బాధపడ్డానేగానీ, యివన్నీ ఆలోచించలేదు ''అయ్ విల్ టీచ్ దెమ్ ఎ లెసన్'' అంది.

* * *

క్లాసులోంచి బయటికి వచ్చి కారు దగ్గరకు వెళ్తున్న ఉషకి తన కారుకి ఆనుకొని అటుతిరిగి నిలబడ్డ ఓ యువకుడు కనిపించి ఆగింది. ఆరడగుల పైగా ఎత్తు, బ్రౌన్ కోటు వేసుకున్నాడు అతను.

''ఎవడే, పెద్ద హీరోలా నీ కారు కానుకొని నిలబడ్డాడు ?'' అంది జయ.

జయ మాటలకి ఆ యువకుడు తిరిగిచూశాడు. అతను – చక్రవర్తి ! చిరునవ్వుతో, హుందాగా విష్ చేశాడు.

ఉష చక్రవర్తిని జయకి, రజనికి పరిచయం చేసింది.

''నేను యిలా రావడం మీకు ఆశ్చర్యాన్ని కలిగించిందనుకుంటాను ?'' అన్నాడు చక్రవర్తి నవ్వుతూ.

''ఆఫ్‌కోర్స్'' అంది ఉష.

''మీకొక హ్యాపీ న్యూస్ చెబుదామని వచ్చాను.''

ఏమిటన్నట్లు చూసింది ఉష.

''మీరు నాకు నచ్చారు.''

ఇది తనకి హ్యాపీ న్యూసట. అంటే అతనికి మామూలు న్యూసన్నమాట ! ఎంప్లాయర్ నిరుద్యోగికి దయతలచి ఉద్యోగం ఇచ్చినట్లుంది.

''ఈ విషయం నేనే మీకు డైరెక్టుగా చెబుదామని వచ్చాను. ఆఫ్‌కోర్స్, ఈ విషయం మా

## మార్పు కావాలంటే

ఓటరులే
సైనికులై
ఓటులే
బులెట్లై
బ్యాలెట్ పెట్టెలే
మర తుపాకులై
అవినీతిపై
దండెత్తితే
విజయం
ధన్యమిదే.

—"శ్రీవాణి"

డాడీ మీ డాడీకి ఈపాటికి చెప్పేసే వుంటారు'' అన్నాడు మళ్ళీ నవ్వి.

తనకి నచ్చితే చాలన్నమాట. తన అభిప్రాయం అడగలేదు. అంటే, తన యిష్టాయిష్టాలతో పని లేదన్నమాట యితనికి! అంటే, యితని దృష్టిలో తను అంత చీప్‌గా కనిపించిందా ?

ఉష గొంతు సవరించుకొని, ''మీకు నేను నచ్చినందుకు చాల థ్యాంక్స్. కాని, నాకూ యిష్టాయిష్టాలున్నాయి. ఇది మారేళ్ళ జీవితానికి సంబంధించిన విషయం. నేను కూడా ఆలోచించాలి. ఏ విషయం రేపు ఈవెనింగ్ మీకు ఫోన్‌లో చెబుతాను'' అంటూ కారెక్కింది ఉష. జయ, రజని ఉషననుసరించారు కారు వెళ్ళిపోయింది.

వీపుమీద గట్టిగా చరిచినట్లయింది చక్రవర్తికి. ముఖంలో నవ్వు ఎగిరిపోయింది. ''ఉష చాల కేర్‌లెస్‌గా ప్రవర్తించింది. కనీసం వెళ్లేప్పుడు మర్యాదగా వెళ్తున్నానని కూడా చెప్పకుండా వెళ్ళిపోయింది. అయ్ విల్ టీచ్ హర్ ఎ లెసన్'' అనుకున్నాడు చక్రవర్తి కసిగా

* * *

''నువ్వు అలా అనకుండా వుండవలసింది'' అన్నారు జయ, రజని.

''ఏం ? ఎందుకని ?'' అంది ఉష కోపంగా.

''అతను చాల బాగున్నాడు. నీకు తగిన జంట'' అంది రజని.

''ఆఫ్‌కోర్స్. నేను మాత్రం బాగోలేనా ?''

''ఇద్దరూ బాగున్నారు. అందుకనే తగిన జంట అంటున్నాము'' అంది జయ.

''టిట్ ఫర్ టాట్. దెబ్బకు దెబ్బ తీశాను. నేనూ ఒక మనిషినేనని, నాకూ ఆత్మాభిమానం అనేది వున్నదనీ, అతనికి తెలియచేశాను. అంతేచాలు ఇంక నా అభిప్రాయం చెబుతాను వినండి. నాకు చక్రవర్తి చాలా చాలా నచ్చాడు. అయ్ లవ్ అండ్ లైక్ హిమ్. రేపు సాయంత్రం ఫోన్‌చేసి ఆ విషయం చక్రవర్తికి చెబుతాను'' అంది ఉష తృప్తిగా.

* * *

టెలిఫోన్ మోగగానే, రిసీవర్ ఎత్తి, ''అయామ్ చక్రవర్తి'' అన్నాడు చక్రవర్తి.

''అయామ్ ఉష. మీకోహ్యాపీన్యూస్‌చెబుదామని ఫోన్ చేశాను. మీరు నాకు నచ్చారు. ఆఫ్‌కోర్స్, ఈ విషయం ఈపాటికి మా డాడీ మీ డాడీకి చెప్పేసే వుంటారు.''

''మీకు నేను నచ్చినందుకు చాల థ్యాంక్స్ ఇది మారేళ్ల జీవితానికి సంబంధించిన విషయం. నేను మీ గురించి పర్సనల్‌గా తెలుసుకోవాలి. ఏ విషయం రెండు రోజుల్లో మీకు కాలేజికి వచ్చి చెబుతాను'' అంటూ రిసీవర్ పెట్టేశాడు చక్రవర్తి నవ్వుకొంటూ.

ఉషకి చెమటలు పట్టాయి. అంటే, తన క్యారెక్టర్ గురించి తెలుసుకోవాలనా అతని ఉద్దేశ్యం? కోపంతో ఉష ముఖం ఎర్రబడింది. 'అయ్ విల్ టీచ్ హిమ్ వన్‌మోర్ లెసన్' అనుకొంది కసిగా.

* * *

రెండు రోజుల తర్వాత క్లాసులోంచి రజని, జయలతోపాటు బయటికి వచ్చిన ఉషకి తన కారు కానుకొని అటుతిరిగి నిలబడ్డ చక్రవర్తి కనిపించాడు

''హలో'' అంది ఉష.

చక్రవర్తి ''హలో'' అన్నాడు వెనక్కి తిరిగి.

''ఇప్పుడు మీరు మీ అభిప్రాయం చెబుతారనుకొంటాను'' అంది ఉష వ్యంగ్యంగా.

''ఎగ్జాక్ట్‌లీ కరెక్ట్. మిమ్మల్ని మ్యారేజ్ చేసికోవడానికి నాకు ఎటువంటి అభ్యంతరమూలేదు'' అన్నాడు నవ్వి.

''థ్యాంక్స్ ఎ లాట్. పెళ్లి చేసుకోబోయే ముందు ఒకరి గురించి ఒకరు పర్సనల్‌గా తెలుసు

పంచదార కావాలా ?
మరి కార్డుందా ?
లేదు కత్తుంది !!!






బులుసు వేంకటరమణయ్య

# మహనీయులను ఏమి అడగాలి ?

స్వార్థ రహితులై, పరోపకార పరాయణులై, లోక కల్యాణం కోరే మహనీయులు నాటికీ, నేటికీ కూడా ఉన్నారు. పూర్వకాలంలో మహామునులు వనవాసం చేస్తూ, వికల మనస్కులై తమ వద్దకు వచ్చినవారికి మనశ్శాంతిని కలిగిస్తూ, తమ తపశ్శక్తి వల్ల లోక హితం కోరి అసాధ్యాలైన కార్యాలు నెరవేరుస్తూ ఉండేవారు ఈ కాలంలో అట్టి మహనీయులు హితబోధలు చేస్తూ ఉండడమేకాక శ్రీమంతులైన శిష్యులను ప్రోత్సహించి ప్రజోపయోగం కోసం శరణాలయాలను, విద్యాశాలలను, ఆసుపత్రులను స్థాపింపజేయడం మనకు తెలుసును. స్వామి వివేకానందులు ప్రపంచంలోని వివిధ దేశాలలో రామకృష్ణ మఠాలను స్థాపించి పెక్కు మార్గాలలో ప్రజాసేవను చేసిన సంగతీ, ఆ సంస్థలు అవిచ్ఛిన్నంగా సాగుతున్న సంగతీ అందరికీ తెలిసినదే! భగవాన్ సత్యసాయిబాబా మత ప్రబోధంతోపాటు విద్యాశాలలను స్థాపించి, వైద్యశాలలను నెలకొల్పి, చేస్తున్న ప్రజాసేవ సాటిలేనిది. ఆయన భక్తులు పెక్కుచోట్ల రోగులకు ఉచితంగా మందులివ్వడం జరుగుతున్నది. ఎరల్డ్ టీచర్ ట్రస్టు యజమానులు కులపతి మాస్టర్ ఇ. కె. గారు నిర్విరామంగా, తమ వద్దకు వచ్చిన వారి సందేహాలన్నిటినీ తీరుస్తూ, తగిన మందులిస్తూ, చికిత్సచేస్తూ, వారి వారి రోగాలను నివారిస్తూ, గొప్ప ప్రజాసేవ చేస్తున్నారు. ఎంతోమందికి తగిన సలహాలిస్తున్నారు.

మహనీయులిలా ప్రజాక్షేమం కోరి వారి హితాన్ని గమనిస్తున్నారని, వారికి శ్రమ, చికాకు గలిగించేటట్లు జనులు ప్రవర్తించడం అనుచితం.

తమ కర్థం కాని విషయాలను గురించీ, సందేహాలను గురించీ ప్రశ్నిస్తే, వాటికి సమాధానాలు చెప్పి, వారు పృచ్ఛకులకు తృప్తిని కలిగించి పంపివేస్తారు. తమ కుటుంబంలోని చిక్కులను గురించీ, గృహ కలహాలను గురించీ మహనీయులను ప్రశ్నించడం, తీర్పు చెప్పగోరడం తగదు. వాటిని తమలో తామే సరిపరచుకోవాలి. అది సాధ్యం కానప్పుడు కోర్టులకెక్కాలి. ఇట్టి విషయాలను చెప్పి వారిని వేధించడం చాలా పొరపాటు. తమ అనుచిత ప్రవర్తనవల్ల అల్లుడు కోపించి, తమ కుమార్తెను విడిచి పెడితే, ఆ అల్లుణ్ణి శాంతపరచి సమ్మతింపజేయాలని కులపతి మాష్టరుగారిని ఒక తగువు మనిషి కోరిన సంఘటన దీనికి దృష్టాంతం!

కుటుంబంలోని కలతలు పోగొట్టుకొనుటకు కుటుంబ సభ్యుల పరస్పర సహకారం, సౌమ్య భావం ప్రధానంగాని మహనీయుల సలహా అడగడం తగదు. సలహా ఇచ్చినా, దాన్ని పాటించకపోతే దాని విలువ పోతుంది. ఈ సంగతి గ్రహించి, మహనీయులకు చికాకు కలుగనట్లు ప్రవర్తించడం, తగిన విషయాలే వారివల్ల తెలుసుకోవడం అవసరం. ★

## ఈతరం అమ్మాయి

కోవడం మంచిది. మీరు నా గురించి తెలుసుకున్నారు. అలాగే నేను కూడా తెలుసుకోవాలిగా మీ గురించి? అందులోనూ మీరు చదివింది అమెరికాలో! అక్కడ మాకు తెలిసినవాళ్ళు చాలామంది వున్నారు. వాళ్ళ ద్వారా మీ గురించి తెలుసుకోవాలి. అప్పుడు నా అభిప్రాయం చెబుతాను'' అంది ఉష కసి తీర్చుకొంటున్నట్లు నవ్వి.

''ఓ. కే. అయితే, మీకు కూడా దీనికి రెండు రోజులు టైము చాలా ?'' అనడిగాడు చక్రవర్తి.

''నో, మిష్టర్. నా గురించి ఈ వూళ్ళో గనుక మీకు రెండు రోజులు సరిపోయింది. మరి మీది అమెరికా కదా! ఓ పది రోజులు పట్టవచ్చు.''

ఈసారి ఉష కారెక్కక ముందే, చక్రవర్తి మరో ప్రక్కన పార్కు చెయ్యబడ్డ తన కారులో కూర్చుని స్టార్టుచేసి వెళ్ళిపోయాడు.

''ఉషా, అనవసరంగా పట్టింపులకి పోతున్నావు. నా కెందుకో భయంగా వుంది'' అంది జయ.

''అతను చేసినట్లే నేనూ చేస్తున్నాను. ఆడా, మగా అందరూ సమానమే. ఆత్మాభిమానం ఒక్క మగవాళ్ళకే కాదు వుండేది'' అంది ఉష సీరియస్‌గా.

''ఇప్పుడు అమెరికాలోని మీ ఫ్రెండ్స్‌కి రాసి చక్రవర్తి గురించి తెలుసుకొంటావా ?'' అంది రజని — ఆసక్తిగా.

''నో. తెలుసుకోవలసిన అవసరం లేదు. అతను మంచివాడని నాకు తెలుసు. చక్రవర్తి మాత్రం నా గురించి తెలుసుకొన్నాడంటావా, ఆ రెండు రోజులు ? ఏదో నన్ను దెబ్బకొట్టడానికి అన్నాడంతే. అలాగే నేను కూడా'' అంది ఉష కారు స్టార్టు చేస్తూ.

*　　*　　*

వారం రోజుల తర్వాత క్లాసులోంచి బయటికి వచ్చిన ఉష, రజని, జయలకు ఉష కారుని ఆనుకొని, అటు తిరిగి నిలబడివున్న చక్రవర్తి కనిపించాడు.

''ఇంక పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. అతను ఈసారి పంతానికి ఏదో చెప్పి, మరో రెండు రోజులు టైము కావాలంటాడు. అందుకని నువ్వు ముందే క్షమాపణ చెప్పు మేము కూడా అతనికి నచ్చ చెబుతాము'' అంది రజని.

''ఇంక చస్తే పంతాలకి పోను. చక్రవర్తి లేనిదే నేను బ్రతకలేను. అయ్ వాంట్ హిమ్'' అంది ఉష బాధగా.

''గుడ్ మార్నింగ్ సార్'' అంది ఉష కారు దగ్గరకు వచ్చి.

చక్రవర్తి తిరిగి చూశాడు.

''గుడ్ మార్నింగ్. మీకో శుభవార్త చెప్పాలని వచ్చాను నా మ్యారేజి సెటిలయింది'' అంటూ ముగ్గురికీ వెడ్డింగ్ కార్డులందించాడు చక్రవర్తి.

ఉషకి కాళ్ళకింద భూమి కరిగిపోతున్నట్లనిపించింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. పెదాలు వణికాయి. గుండెల్ని ఎవరో కోస్తున్నట్లయింది. ఒక్కొక్క నరం తెగిపోతున్నట్లనిపించింది.

''నో—నో—అయ్ లవ్ యూ. అయ్ లవ్ యూ'' అంది కారుకేసి తల కొట్టుకొంటూ పుస్తకాలు కిందపడిపోయాయి.

''నేను ఆత్మాభిమానం కోసం పిచ్చిపట్టినట్లు ప్రవర్తించాను ... అయ్ లవ్ యు. ప్లీజ్ ... నన్ను క్షమించండి. నాకు అంత శిక్ష వెయ్యవద్దు. నేను భరించలేను. ఆ మ్యారేజ్ క్యాన్సిల్ చేయించండి...'' అంటూ చక్రవర్తి చేతులు పట్టుకొంది.

చక్రవర్తి నవ్వుకున్నాడు.

''ఏయ్ ఉషా, వెడ్డింగ్‌కార్డులో పెళ్ళికూతురు నువ్వే. కావాలంటే చూడు'' అంటూ వెడ్డింగ్ కార్డు చూపించింది జయ.

ఉష తల ఎత్తి చక్రవర్తిని చూసింది.

చక్రవర్తి అందంగా నవ్వాడు. ''మీ గురించి మీ ఫ్రెండ్సు జయ, రజని మా మమ్మీకి చెప్పారుట. అందుకని, ఏకంగా ముహూర్తాలు పెట్టించి, వెడ్డింగ్ కార్డ్సు కూడా వేయించేశాము. సరిగ్గా వచ్చేవారం యిదే రోజున మన మ్యారేజి.''

''రియల్లీ అయామ్ హ్యాపీ. అయామ్ వెరీ వెరీ హ్యాపీ'' అంది ఉష చక్రవర్తి చేతిని కిస్ చేస్తూ ★

# "కేర్‌ఫ్రీ రక్షణ –దానిలా మరొకటి లేదిక!"



మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుని తయారుచేసారు కేర్‌ఫ్రీ. ఇబ్బందైన ఆ 5 రోజుల్లో ఆధునిక యువతికి కావలసిన భద్రత కూడిన ఆ సంరక్షణని యిస్తుందది.

మీకు అధిక రక్షణ యివ్వడానికి దీనిలో మరింతగా పీల్చుకునే గుణం

కేర్‌ఫ్రీ శాస్త్రీయంగా రూపొందించబడినది దీని లోపల భాగంలో గల మెత్తని పొరలు, ప్రత్యేకమైన రీతిలో పీల్చుకోగలిగే పదార్థంతో చేయబడ్డాయి

కేర్‌ఫ్రీ మీకు యిప్పటి దాకా వాడిన వాటి అన్నిటి కన్నా చెమ్మను నిలుపుకోగలుగుతూ, మీకు మరింతగా రక్షణని యిస్తుంది అయినా యిది ఎంతో సన్నగా, సున్నితంగా, యిమిడికగా ఉంటుంది

అద్వితీయమైన దీనికిగల ప్లాస్టిక్ కవచం మరకలు పడటాన్ని నిరోధిస్తుంది

కేవలం కేర్‌ఫ్రీలోనే క్రింది భాగం చుట్టూరా, నేప్‌కిన్‌కి



రెండు వైపులా గల 3-వైపుల గల నీలి ప్లాస్టిక్ కవచం మధ్యన అడుగా నిలవడం కోసం ఉంది. అందుకే యిది తడిసి పోతుందని గాని, మరకలు పడుతుందని గాని భయం లేదు

ఎంతో సౌకర్యం, మరెంతో వీలు

కేర్‌ఫ్రీ మీకు పూర్తిగా సౌకర్యాన్నిస్తుంది దీన్ని వాడటం పారెయ్యడం ఎంతో తేలిక. దీన్ని ఫ్లష్ చేసెయ్యండి, అంతే మార్చుకోవడం కూడా వీలు మీరెప్పుడు మార్చవలసివచ్చినా మీకెంతో సౌకర్యం

అవును కేర్‌ఫ్రీతో మీరెంతో భద్రంగా, ఎంతో సౌకర్యంగా ఉంటారిక, అసలు నెలలో అది ఏ రోజూ అనే ధ్యాసే ఉండదు మీరిక ఏం చెయ్యదలుచుకున్నా చేఫికరుగా చేయగలరు మరి. ,ఎందుకంటే మరేదీ యివ్వలేని రక్షణను యిస్తుంది కేర్‌ఫ్రీ!

ఇది 10 మరియు 20 నేప్‌కిన్స్ ప్యాక్‌లలో దొరుకుతుంది




Johnson & Johnson*

# కేర్‌ఫ్రీ*–కాలం మారుతున్నయీ రోజుల్లో పూర్తి రక్షణ




'పీపుల్స్ స్టోర్స్'

'ప్రజల దుకాణం.'

ఇంగ్లీషు, తెలుగు భాషలలో వ్రాయించిన బోర్డు రంగు, రంగులదీప తోరణాల మధ్య పేదవాడి గుండెలో ఆశలా వెలిగిపోతోంది.

పట్నంలో అత్యంతాధునికమైన స్టోర్సు అది. అక్కడ అన్ని వస్తువులు 'సరసమైన' ధరలకు దొరుకుతుంటాయి. రంగు రంగుల షోకేసులలో అందంగా అమర్చిన బిస్కట్ ప్యాకెట్లు, టిన్ ఫుడ్స్, కేక్స్, బ్రెడ్స్ నోరూరేలా కన్పిస్తుంటాయి. 'రారా ప్రియా' అంటూ కస్టమర్లని ఆహ్వానిస్తుంటాయి.

ఆ రోడ్ మంచి షాపింగ్ సెంటర్ కావడం వలన జనం క్రిక్కిరిసివుంటారు. ఆ రోడ్డుమీద జనం ప్రవాహంలా పరుగిడుతుంటారు. ఆ పట్టణంలో కెల్లా ఆ రోడ్‌మీద 'ఫ్లోటింగ్ పాపులేషన్' ఎక్కువంటారు.

ఆ స్టోర్సు కెదురుగా పేవ్‌మెంటుపై ఓ మూలగా ఒదిగి కూర్చొని రోడ్డుపై వెడుతున్న వారందర్నీ పైసల కోసం యాచిస్తున్నాడు బోసయ్య.

బోసయ్య ముష్టివాడేకాని ముసలివాడుకాదు. రాత్రి పూటల్లా రోడ్లమీద పడిన తుక్కు కాగితాల్ని గోనెసంచిలోకి ఏరుకొని అమ్ముకుంటాడు. అయితే యిటీవల కొద్ది నెలలుగా ఆ వృత్తిలో కూడా 'కాంపిటేషన్' ఎక్కువయిపోయింది. బోసయ్య కష్టార్జితం ఓ పూట గంజినీళ్ళకు గూడా చాలడం లేదు. అందుకే తప్పనిసరిగా యీ పెట్టుబడిలేని వ్యాపారాన్ని ఎంచుకున్నాడు.

బోసయ్య తండ్రి రాజయ్య ఒకప్పుడు స్థితి పరుడే! అతను బుద్ధిగా వుండి వుంటే బోసయ్యకు యీ గతి పట్టివుండేది కాదు. స్వాతంత్రోద్యమంలో దేశం దేశం అంటూ వున్న ఆస్తినంతా హారతి కర్పూరంలా వెలిగించేశాడు. సుభాష్‌చంద్రబోస్ నాయకత్వంలోని ఆజాద్ హింద్ ఫౌజ్‌లో తను పనిచేస్తున్నప్పుడే మగ పిల్లవాడ్ని ప్రసాదించి, పెళ్ళాం కళ్ళు మూసింది. కొడుక్కు ముద్దుగా 'బోస్' అని పేరు పెట్టుకున్నాడు. కాలంతోబాటు ఆ పేరు బోసయ్యగా మారింది

పింఛన్లు అందుకోవడానికి రాజయ్య బ్రతికి లేడు. ఒకవేళ బ్రతికివున్నా రాజయ్యకు పింఛన్లు అందేవికావు. ఎందుకంటే రాజయ్య జైలుకెళ్ళిన దాఖలాలేమీలేవు అజ్ఞాతంగానే వుంటూ బ్రిటిష్ వాళ్ళను గజగజలాడించాడు. అజ్ఞాతంగా వుంటూనే తనువు చాలించాడు.

రాజయ్య మరణించేటప్పటికి బోసయ్యకు పదేళ్ళ వయస్సు. తండ్రి పోవడంతో రెక్కలు తెగిన పక్షి అయ్యాడు. అయినా తండ్రి చెప్పిన సూక్తులు వంటబట్టాయి, ఆస్థిపాస్తులు లేకపోయినా. అందుకే ఎక్కడా బ్రతకలేకపోయాడు.

దారినపోయే వారినందర్నీ నోటికి తెరిపిలేకుండా అర్థిస్తున్నాడు బోసయ్య. అయినా చేతులలో పైసలు రాలడంలేదు. ఆగి ఆగి స్టోర్సువైపు చూస్తూ నోరు తడిచేసుకుంటున్నాడు.

ఆ షాపు అద్దాల్లోంచి కనబడే రొట్టె తినాలని సరిగ్గా వారం రోజులనుంచీ బోసయ్య ప్రయత్నం చేస్తున్నాడు. సాధ్యం కావడంలేదు. రోజూ ఆ రొట్టె కొనుక్కెళ్ళే కాన్వెంటు బాబునడిగి ఆ రొట్టె ఖరీదు రెండ్రూపాయలని తెలుసుకున్నాడు. ఆ రొట్టెతో నంజుకోవడానికి ఏదో జామ్ కూడా వుంటుందట! భలే మజాగా వుంటుందట!

మాటలు తలుచుకొంటుంటేనే నోరూరి పోతోంది బోసయ్యకు. వారం రోజులబట్టీ రోజుకు పది పైసల చొప్పున కూడబెట్టాడు. ఇంకా ఎన్ని రోజులు కూడబెడితే ఆ రొట్టె వస్తుందో తెలియదు

వెన్నెల మోమును
మంగళకరమైన

మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి
ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల వృష్ట
వదనాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం
చేసేటందుకే కన్నులకింపైన 14 రంగులలో
దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో
తయారుచేయబడు ఐటెక్స్ తిలకం
చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు



గానీ చూపులతోనే కడుపు నింపుకుంటున్నాడు రోజూ.

ప్రతిరోజూ ఎన్నో కార్లు వచ్చి ఆ స్టోర్సు ముందాగి వెళుతుంటాయి. ఈ రోజువున్న మోడల్ బ్రెడ్ రేపుండదు. ఈ రోజువున్న స్టాకు రేపు వుండదు. ఇదంతా పరిశీలించడం నిత్యకృత్యమై పోయింది బోసయ్యకు.

ఆరురోజులపాటు కూడబెట్టిన అరవై పైసలతో నిన్న ఆ షాపతని దగ్గరకు వెళ్ళాడు బోసయ్య

బోసయ్య వంక క్రిందనుండీ పైదాక చూసి 'ఇవ్వాళ కాదు శనివారం పో' అంటూ కసిరాడు షాపు యజమాని.

''ఆ రొట్టె కావాలి బాబూ'' అంటూ ఆ రొట్టెవైపు చూపించాడు బోసయ్య.

ఆశ్చర్యపోయాడు షాపు యజమాని.

''ఏరా, ఎగతాళిగా వుందా? డబ్బులెత్తావా?'' వ్యంగ్యంగా అడిగాడు.

భద్రంగా జేబులోంచి ఏరి పైసలు యజమాని చేతిలో పోశాడు.

పైసలు తిరిగ్గా లెక్కగట్టి పకపక నవ్వాడు యజమాని.

''పోరా, పో! ఆ బ్రెడ్ ఇంకా పైసలకు రాదు'' చెప్పాడు.

''పోనీ, వచ్చినంత యిప్పించండి దొరా!'' బోసయ్య కంఠంలో తినాలన్న కాంక్ష తీవ్రంగా పలికింది.

''పోరా, పో! ఆ మూల బడ్డీకొట్లో బన్ కొనుక్కో. ఇవి పెద్దోళ్ళు తినే బ్రెడ్స్!'' చెప్పాడు తారతమ్యాన్ని విశదీకరిస్తూ.

నిరాశగా వెనక్కు తిరిగి పైసలు కూడగట్టడంలో నిమగ్నుమయ్యాడు మళ్ళీ. అయినా చూపులన్నీ ఆ రొట్టెమీదనే!

ప్రక్కనే 'కుంయ్' మన్న శబ్దం విన్పించి ప్రక్కకు తిరిగిచూశాడు బోసయ్య.

ఓ గజ్జికుక్క నిలబడి స్టోర్సువంకే చూస్తోంది.

''పోవే నీయవ్వా'' అంటూ కంకర్రాయి విసిరాడు కుక్కమీదకు.

అది రాయినుండి తప్పించుకోవడానికి వేగంగా పరిగెత్తి మళ్ళీ అదే వేగంతో వచ్చి బోసయ్య ప్రక్కన నిలబడింది.

## ది కుక్క

ఆ కుక్కను చూస్తుంటే బోసయ్యకు ఒళ్ళు కంపరమెత్తుతోంది. ఇవ్వాళొక్కరోజే కాదు, దాదాపు వారం రోజులనుండీ రోజూ యిదే వరస.

ఎక్కడనుండి వస్తోందో తెలియదు. బోసయ్య వచ్చేవేళకు వస్తుంది. బోసయ్య ప్రక్కనే నిల్చుంటుంది. బోసయ్యతో కలిసే స్టోర్సు వైపు చూస్తుంటుంది.

ఆ కుక్క ఆకారాన్నిబట్టి అది బోసయ్య స్వంత కుక్క అని చాలామంది అనుకోవడంలో తప్పులేదు.

అది మామూలు వూరకుక్క. నల్లటి చర్మము మీద తెల్లతెల్లని మచ్చలు దిష్టిబొమ్మను గుర్తుతెస్తుంటాయి. నల్లటి జాతు ఒత్తుగావున్నా అక్కడక్కడ గజ్జిపట్టి వెంట్రుకలన్నీ రాలిపోయి 'మొరికలు' కనబడుతుంటాయి. స్టోర్సు వైపే చూస్తుండే దాని చూపుల్లో ఎలాగైనా ఆ రొట్టె తినాలన్న కాంక్ష బలీయంగా కనబడుతోంది.

## మురికి నీటితో విద్యుత్తు!

మురికి నీటి మడ్డిని వదిలించుకొనడం చాలాకాలంగా ఒక సమస్యగా వుంది. దీనిని వదిలించుకోడానికి జపానులో ఒక క్రొత్త ఉపాయాన్ని కనుగొన్నారు. ఈ మడ్డిని ఇంధనంగా వుపయోగించే విద్యుత్ కర్మాగారాన్ని నిర్మించారు. ఈ కర్మాగారం ప్రయోగాత్మకంగా యీ సంవత్సరంలో పనిని ప్రారంభించింది. దీనివలన రెండు వుపయోగాలున్నాయి. దీనివలన రోజుకు 110 టన్నుల మడ్డిని దహిస్తారు. ఇంధనం ఖర్చు కొంతవరకు కలిసొస్తుంది. దీనివలన 150 కి.వా. విద్యుత్తు వుత్పత్తి కాగలదు. మొదట మడ్డిని రంపపు పొట్టుతో కలిపి 'డ్రైయర్' సహాయంతో ఆరబెడతారు. దీనిని ఆ తరువాత ఇంధనంగా జనరేటర్లో వుపయోగిస్తారు. దీనివలన ఏర్పడే ఉష్ణంలో కొంత భాగాన్ని డ్రైయర్లో కూడా వుపయోగిస్తారు.

రెండు నిమిషాలు దూరంగా నిలబడి మళ్ళీ బోసయ్య ప్రక్కకేవచ్చి నిలబడిందా కుక్క చొంగ కార్చుకుంటూ.

బోసయ్య దాని చూపునుబట్టి ఆలోచనను కనిపెట్టేశాడు.

''తస్సాదియ్యా. ఈ కుక్కకు గూడా ఆ రొట్టెనే తినాలనుందన్నమాట! తనకూ తినాలనుంది కాబట్టి అది తన స్నేహితుడన్నమాట'' అనుకున్నాడు.

ఆ ఆలోచన రాగానే కుక్కమీద ప్రేమ కలిగింది.

దగ్గరకు పిలిచి తలమీద చేత్తో రాశాడు.

అనుకోని ఆ ఆప్యాయతకు ఆశ్చర్యపోయిన కుక్క సంతోషంగా బోసయ్య చేతిని నాకింది.

'ఆ రొట్టె కొన్నప్పుడు దీనిక్కాస్త పెట్టాలి' అనుకున్నాడు బోసయ్య కుక్కను నిమురుతూ.

మరో రెండురోజులు దొర్లాయి. బోసయ్య దిన చర్యలో మార్పులేదు. అతని సంపాదనలో ఎదుగుదలలేదు. 'రేపు శనివారం. పైసలు ఎక్కువ రాలొచ్చు. ఎలాగైనా రేపు తినాలి' రొట్టె వంక చూస్తూ పెదాలు తడిచేసుకుంటూ అనుకున్నాడు బోసయ్య.

కుక్క దగ్గరగావచ్చి ఆప్యాయంగా చేతిని నాకింది.

'తస్సాదియ్యా, దీనిక్కూడా రొట్టె జబ్బు పట్టినట్లుంది' తలమీద నిమురుతూ అనుకున్నాడు బోసయ్య.

స్టోర్సు ముందు విమానం లాంటి కారొచ్చి ఆగింది. ఖరీదైన సిల్కు చొక్కా కారులోంచి దిగింది. పెద్ద నాణెం పడుతుందన్న ఆశతో కారు దగ్గరకు పరిగెత్తాడు బోసయ్య. ఏదో వస్తుందన్న ఆశతో గజ్జికుక్క గూడా వెంటబడింది.

చేయి చాచిన బోసయ్య వంక చూస్తూ ''దుక్కలాగున్నావు. పని చేసుకు బతకరాదూ'' అంటూ విదిలించాడు సిల్కు చొక్కా యజమాని.

చేతినిండా పనిలేదని, ఉన్నపని చేసుకుంటున్నా కడుపు నిండటం లేదని పనిచేయని సిల్కు చొక్కాకేం తెలుస్తుంది!

నిరాశగా నిట్టూరుస్తూ అక్కడే నిలబడి

## ఎడారి

నేను
ఒక
ఎడారిని !
నాలోని
ఆశయాలు
ఎడారి మొక్కలు
నాలోని
ఆశలు
ఎడారి
ఇసుకరేణువులు.

— బిట్టు

పోయాడు బోసయ్య. ప్రక్కనే కుక్క చొంగ కారుస్తూ నిలబడి ఆత్రంగా చూడసాగింది రొట్టె వంక.

సిల్కు చొక్కా బాక్ డోర్ తెరిచాడు. లోపల నుండి సింహం పిల్లలా వున్న అల్సేషియన్ డాగ్ చెంగున క్రిందకు దూకింది.

''కమాన్ జానీ'' అంటూ స్టోర్సులోకి నడిచాడు సిల్కుచొక్కా పెద్దమనిషి.

అరగంటసేపు రకరకాల వస్తువులు కొన్నాడు. అల్సేషియన్ జానీ గోముగా అతని పంచె పట్టుకొని షోకేస్‌వైపు చూపించింది.

షాపతన్ని ఏదో అడిగాడు సిల్కుచొక్కా పెద్దమనిషి. వెంటనే షాపతను వినయంగా షోకేస్ లోంచి బ్రెడ్ తీసి డాగ్ కందించాడు. తోకాడిస్తూ బ్రెడ్ అందుకుంది డాగ్ జానీ.

బయటకు వచ్చేటప్పుడన్నా దయ కలగక పోతుందాని ఆశగా చూస్తూ అక్కడే నిలబడివున్నాడు బోసయ్య.

తను పది రోజులనుండీ తినాలనుకుంటున్న రొట్టెను అరక్షణంలో పొందిన 'సీమకుక్క' వైపు గుర్రుగా చూడసాగింది 'వూరకుక్క'.

షాపింగ్ ముగించుకొని బయటకొచ్చి కారెక్కాడు సిల్కుచొక్కా పెద్దమనిషి. అల్సేషియన్ అతని ప్రక్కనే చోటు చేసుకుంది.

వట్టిచేతులు దులుపుకుంటూ నిరాశగా వెనక్కు తిరిగాడు బోసయ్య.

అయితే ఈసారి కుక్క మాత్రం బోసయ్యను అనుసరించలేదు.

షోకేసులో వున్న రొట్టెల దొంతరవైపు ఆబగా, ఆశగా చూసింది. షాపులోకి పరీక్షగా చూసింది. షాపతను ఖాళీ అయిన బ్రెడ్ స్థానంలో కొత్త బ్రెడ్ అమరుస్తున్నాడు.

ఒక్క ఉదుటన స్టోర్సులోకి దూకింది. అడ్డుపడిన షాపతని చేతిని కండ వూడేలా పీకింది. అమాంతంగా బ్రెడ్‌ను నోట కరచుకొని రోడ్‌పై కురికింది.

రోడ్డుమీద అందరితోబాటు ఆశ్చర్యంగా చూస్తున్న బోసయ్య హఠాత్తుగా ఏదో గుర్తుకొచ్చి కుక్క పరుగెత్తిన 'దిక్కు' వైపు వేగంగా పరిగెత్తాడు. 

'మిస్టర్ విజయ్'లో రాధ ★ 'కృష్ణార్జునులు'లో శోభన్‌బాబు, జయప్రద





# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## ఇంట్లో రామయ్య – వీధిలో కృష్ణయ్య

''మా పిక్చర్‌లో గొల్లపూడి మారుతీరావుగారు మహాద్భుతంగా నటించేశారండోయ్ మా పిక్చర్ రిలీజ్ అయ్యాక ఈయన చాలామంది కేరెక్టర్ ఆర్టిస్టులకు పోటీ అయి కూర్చుంటారు,'' అన్నారు ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రాన్ని పాలకొల్లు పరిసర ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో ముగించుకుని వచ్చిన నిర్మాత కె రాఘవ గొల్లపూడి పాత్ర గురించి కథకుడు, దర్శకుడు కోడి రామకృష్ణ వివరిస్తూ, ''ఇంట్లో రామయ్య–వీధిలో కృష్ణయ్య'' అనే పేరు తలచుకుంటే ఎవరికైనా నవ్వొస్తుంది కాని, అంగరూ నవ్వేసి మరిచిపోయే నవ్వులాట మనిషి కాదితడు. ఓ కాపురాన్ని నవ్వులపాలు చేసిన మనిషి కాపురాన్ని గాజుబొమ్మలా నేలకు విసిరిన మనిషి ఈ రామయ్యలాంటి కృష్ణయ్య, కృష్ణయ్య లాంటి రామయ్య ఎంతకైనా సమర్థుగు ఇతనికి రెండు తలలు, వేయి నాలుకలు, లక్ష రంగులు, కోటి రూపాలు దేవుడ్ని కూడా తాను దేవుడు కాదని నమ్మించగల దేవాంతకుడు ప్రతిదేశంలో, ప్రతిఊళ్ళో, ప్రతివీధిలో ఉంటాడు అతన్ని కనిపెట్టకపోయినా, ఆలోచించకపోయినా తప్పు మనదే అవుతుంది, అతనిదేం కాదు ఇలాంటి సజీవ వ్యక్తిత్వానికి గొల్లపూడిగారు సరైన తెరరూపం ఇచ్చారు వీరూ, సుప్రసిద్ధ దర్శకులు సి ఎస్ రావ్‌గారూ నేను దర్శకత్వం వహించిన తొలి చిత్రంలో నటించడం నా పూర్వజన్మ సుకృతం నాకీ మహదవకాశాన్నిచ్చిన రాఘవగారికి ఎంతైనా కృతజ్ఞుడ్ని,'' అన్నారు

చిరంజీవి, మాధవి, సంగీత, పూర్ణిమ ఇతర ముఖ్య భూమికలు నిర్వహించారు జె వి రాఘవులు స్వరకల్పనలో సి నారాయణరెడ్డి గీతాలు రాశారు ఎస్ ఎస్ లాల్ ఛాయ, కె ఎల్ ధర్ శిల్పం, బాలు కూర్పు ఇతర తెరవెనుక హంగులు ఫిబ్రవరి 5న విడుదల

## భానుమతీ రామకృష్ణ "భక్తధ్రువ – మార్కండేయ"

"రండు రండు అసీనులు కండు నేనొక పౌరాణిక చిత్రరాజమును నిర్మించుచుంటిని తత్కారణముగా గ్రాంధిక భాషలో మాట్లాడుచున్న దానను," అన్నారు భానుమతీ రామకృష్ణ. ఈమె రచన, దర్శకత్వంలో భరణీ పిక్చర్స్ అండ్ శ్రీ మీనాక్షి ఫిలిమ్స్ నిర్మించే "భక్తధ్రువ – మార్కండేయ" చిత్రంలో వంశీకృష్ణ, పింకీ, రాణి, బాబు, తులసి, ప్రీతి, రవిశంకర్, వాణి వగైరా 5–15 ఏళ్ళ లోపు బాలలే పాల్గొంటున్నారు. అప్పుడప్పుడు ఇలాంటి భక్తిరస ప్రధాన చిత్రాలు వస్తున్నంత కాలం ప్రజలలో దైవభీతి, పాపచింత నశించదన్న అభిప్రాయాన్ని తెలియజేశారామె. ఎస్ రాజేశ్వరరావు స్వరకల్పనలో ఆరుద్ర, వేటూరి, కొసరాజు గీతాలు రాస్తున్నారు. కె ఎస్ ప్రసాద్ ఛాయాగ్రాహకుడు. పెండ్యాల వెంకటేశ్వరరావు సహకార దర్శకుడు. అవధాని, ఆర్ సి దొరై నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. తడ, చిత్తూరు, మదనపల్లి ప్రాంతాలలో చిత్రీకరణ జరుగుతుంది. ఫిబ్రవరి చివరి వారంలో చిత్రీకరణ ముగుస్తుంది. ఏప్రిల్ విడుదల. ఈ చిత్రం తమిళ, హిందీ భాషల్లో కూడా తయారౌతుంది.

## "నాలుగు స్తంభాలాట"లో విజయనిర్మల పుత్రుడు

జంధ్యాల రచన, దర్శకత్వంలో ఎన్ కృష్ణంరాజు నిర్మించే నవత ఆర్ట్స్ వారి పై చిత్రం షూటింగ్ జనవరి 8న విశాఖపట్నంలో మొదలైంది. "ఫిబ్రవరి మొదటివారం వరకు సతత చిత్రీకరణతో పూర్తి చేస్తాం," అన్నారు నిర్వహణ బాధ్యతలు వహించే ఎన్ అచ్యుతరామరాజు. విజయనిర్మల పుత్రుడు నరేష్‌కుమార్ ఇతర సంస్థల చిత్రాలలో నటించడం ఇదే ప్రథమం. ప్రదీప్, పూర్ణిమ, తులసి, రోహిణి, అన్నపూర్ణ, జానకి, శ్యామల, వీరభద్రరావు, శంకర్, సత్తిబాబు, ప్రకాశరావులు కూడా పాల్గొంటున్నారు. వేటూరి, రాజన్ నాగేంద్ర, గోపాల్‌రెడ్డి, కళాధర్, జి జి కృష్ణారావు, శివసుబ్రహ్మణ్యం, టి ఎం సంతానం, యు వి ఎస్ పాణి తెరవెనుక కృషి చేస్తున్నారు.



'వంశగౌరవం'లో విజయశాంతి

★

'గృహప్రవేశం'లో మోహన్‌బాబు, జయసుధ

## దిలీప్‌కుమార్ మళ్ళీ పెళ్ళాడాడా ?

హైదరాబాద్, బెంగుళూరు నుంచి వెలువడే కొన్ని దినపత్రికల్లో ఇటీవల సంచలనం కలిగించే ఓ వార్త వెలువడింది హైదరాబాద్‌కు చెందిన అస్మా మొహియుద్దీన్ అనే 33 ఏళ్ళ అందమైన స్త్రీని దిలీప్ పునర్వివాహం చేసుకున్నట్లు ఆ వార్త ఆమె ముగ్గురు బిడ్డల తల్లి అట ఆమె (మొదటి) భర్త సాదిక్ మొహియుద్దీన్ హైదరాబాద్‌కు చెందిన కోటీశ్వరుడు, వణిక ప్రముఖుడు (ఇప్పుడు కలకత్తాలో ఉంటున్నాడట) ఆయనకు అస్మా విడాకులు ఇచ్చేశాక నిరుడు జూలైలో దిలీప్‌ను పెళ్ళాడిందట ఇందుకు దిలీప్ (మొదటి) భార్య సైరాబాను సమ్మతించిందట కాని, దిలీప్ ఈ వార్త అసత్యమని ఖండించాడు "ఇది ఎవరో గిట్టనివాళ్ళు పుట్టించిన పుకార్లు నాకు సైరా తప్ప మరో భార్యలేదు సంఘంలో గౌరవంగా బతుకుతూన్న నా మీద ఇలా దుమ్మెత్తిపోయడం వల్ల ఎవరికి ఏం లాభమో ! కొంతకాలం క్రితం బొంబాయి షణ్ముఖానంద హాలులో ఓ వనిత తను నా భార్యగ స్టేజ్‌మీద ప్రకటించుకుందట ఇవన్నీ నమ్మకండి," అని దిలీప్ తెలియజేశాడు




"డైలాగులు చాలా సహజంగా వున్నాయి కద గురూ !"

## "మహారాయుడు"

"శోభన్‌బాబు ద్వయెల్ రోల్‌ను పోషిస్తారు," అన్నారు సుమన్ క్రియేషన్స్‌వారి పై చిత్రాని సమర్పించే ఎం రామకృష్ణారెడ్డి ఇదివరకు సి ఎస్ రావు, కె ఎస్ ఆర్ దాస్, కొమ్మినేని మున్నగువారి వద్ద అసోసియేట్‌గా, కో-డైరెక్టర్‌గా అనుభవం గడించిన బి ఎల్ వి ప్రసాద్ తొలిసారిగా దర్శకత్వం వహించే చిత్రమిది జంధ్యాల, చక్రవర్తి, వెంకట్, తార వగైరా సాంకేతికవర్గం ఏప్రిల్‌లో సెట్స్‌కు వెళ్తుందని నిర్మాత ఎం శ్యామలారెడ్డి తెలిపారు

## మొండిఘటం

"మొదటి షెడ్యూల్ గుంటూరులో మార్చి 18 నుండి 31 వరకు, రెండవ షెడ్యూల్ ఏప్రిల్ 11 నుంచి 25 వరకు జరుగుతాయి," అన్నారు దగ్గుపాటి భాస్కరరావు ఈయన అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ పతాకంలో చిరంజీవి, మాధవి, సత్యనారాయణ ప్రభృతులతో "మొండిఘటం" చిత్రాన్ని నిర్మిస్తారు భరత్ కథకు ఈ చిత్ర దర్శకుడు రాజాచంద్ర స్క్రీన్‌ప్లే, మాటలు రాశారు సత్యం సంగీత దర్శకుడు చెంగయ్య ఛాయాగ్రాహకుడు సాయికుమార్ శిల్ప దర్శకుడు

# మీరెవరి మదినైనా కలవర పెట్టాలనుకున్నప్పుడు

## అమాయకత్వం చిందించే బొట్టు పెట్టుకోండి.

మీ కనురెప్పలలో తత్తరపాటు,
నడకలో వయ్యారంతోపాటు
నొసట శింగార్ కుమ్‌కుమ్ బొట్టు
పెట్టుకు చూడండి.
శింగార్ రంగులలోని
అత్యుత్తమ పదార్థాలతో
తయారైంది, మీ హావభావాలకు
సరితూగేలా...మీ బట్టల
అందాన్ని మరింత చేసేలా.




**శింగార్**

**కుమ్ కుమ్ బొట్టు**
**—భారతదేశపు**
**అత్యంత అందమైన**
**సౌందర్య తిలకం**

everest/80/SH/76/tl

# సినిమా

## ఇద్దరు కొడుకులులో ఎవరు తన్నకొడుకు ?

స్పృహా తప్పిన రాముని అతి కష్టంమీద హాల్లోకి మోసుకొచ్చాడు రాజా (శోభన్‌బాబు) మెల్లగా మెట్లకేసి పోబోతూండగా పైనుంచి "ఆగు!" అన్న గర్జన వినిపించింది ఎస్ పి చౌదరి (సత్యనారాయణ) గబగబ మెట్లు దిగి వచ్చాడు "ఏరా! బరువు బాధ్యతలేవి తెలియకుండా తప్పుడు దారిలో తిరుగుతూ చెడిపోయిన నువ్వు వాడిని కూడా నాశనం చెయ్యాలని నిశ్చయించుకున్నావా ?"

రాముని పక్కనే సోఫాలో కూర్చోబెడుతూ, 'లేదు, డాడీ! మీరు పొరపాటు పడుతున్నారు," అన్నాడు రాజా

"ఒరేయ్! నీతిగా సంపాదించి నీకు అన్నం పెట్టాను నిజాయితీగా కష్టపడి నిన్నింతవరకు పెంచాను ఆలయం లాంటి ఇంట్లో దేవతలాంటి మీ అమ్మ నీడన ఉంటూ కూడా నువ్విలా పాడవడానికి



'మధురగీతం' లో సురేష్, శాంతికృష్ణ

కారణం — నువ్వు కామరా, నీలో ఉన్న పాపిష్టి రక్తం," అని చౌదరి అంటూండగా లక్ష్మీదేవి (పుష్పలత) పరుగున వచ్చి, "ఏవండీ, వద్దండీ తొందర పడొద్దండీ!" అని వేడుకుంది

"లక్ష్మీ! తనే కాకుండా తోటివాడిని కూడా తప్పుడు దారిన పట్టిస్తూంటే — ఒక తండ్రిగా, ఈ ఇంటి పెద్దగా ఇంతకాలం నా గుండెల్లో దాచుకున్న నిజాన్ని ఈనాడు వీడికి చెప్పక తప్పదు రాజా! పాపిష్టి రక్తం పంచుకు పుట్టినవాడ్ని పవిత్రమైన ఇంట్లో పెంచినా — వాడి గుణం మారదని ఈనాడు నిన్ను బట్టే నా కర్థమవుతోంది"

"డాడీ! ఏమిటి ? ఏమిటి మీరనేది ?" రాజా అయోమయంగా చూశాడు

"అప్పుడా నీ పసితనంలో — కొన్ని పరిస్థితుల్లో మాకు పుట్టిన బిడ్డకి, ఒక పతితకు పుట్టిన బిడ్డకి తేడా తెలీక, మా కన్న బిడ్డెవరో తేల్చుకోలేక, మీ ఇద్దరినీ తీసుకొచ్చి పెంచుకున్నాంరా పెరిగే వయసులో నడవడికనుబట్టి కొంత కొంత అనుమానించినా — ఇద్దరీ ఒక్కలాగే పెంచుకున్నాం కనుక, ఏ రోజునా ఈ నిజాన్ని బయటపెట్టలేదు కాని, ఈనాడు నీ బుద్ధులబట్టీ, నీ ప్రవర్తనబట్టీ నువ్వు మా బిడ్డవు కాదని ఖచ్చితంగా నిర్ణయించుకున్నాను అందుకే చెబుతున్నానురా! చీకట్లో పాపంలో అర్థం పర్థం లేకుండా పెరగవలసిన నిన్ను అభిమానంతో, అనురాగంతో ఇంతకాలం పెంచుకున్నాం అదేరా మేం చేసిన పాపం ఒరేయ్, నీతోబాటే వాడిని కూడా నాశనం చేసే నిన్ను ఇక నేను క్షమించలేను

ఈ ఇంట్లో నీకు ఇక స్థానం లేదురా! గెట్ లవుట్!"

రాజా గద్గద స్వరంతో "డాడీ! తండ్రి మమకారం, తల్లి ప్రేమా, సోదరుడి అనురాగం — ఇవన్నీ నాకు ఇంత కాలం అందించినందుకు ఎంతో కృతజ్ఞుడ్ని వెళ్తున్నాను, డాడీ!" అంటూ లక్ష్మీదేవి వంక తిరిగి, "అమ్మా! నేను కొడుకు కానివాడిని కొరగానివాడిని నేను దూరం అవడమే మంచిదమ్మా కాకపోతే పెంచిన ప్రేమ, మమత ఒక్కసారిగా తెంచుకొని వెళ్ళడం చాలా కష్టంగా ఉందమ్మా అయినా తప్పదు అమ్మా నేనిక లేనని, ఇక నేనేమీ కానని గుండె రాయి చేసుకోమ్మా! నన్ను మర్చిపోమ్మా — మర్చిపో వస్తా, డాడీ! గుడ్ బై!" అంటూ వడివడిగా వెళ్ళిపోయేసరికి చౌదరి, లక్ష్మీదేవిల కళ్ళు చెమ్మగిల్లాయి



'నిప్పుతో చెలగాటం'లో కవిత

తమ్మారెడ్డి కృష్ణమూర్తి సమర్పణలో కట్టా సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే రవీంద్ర ఆర్ట్ క్రియేషన్స్ "ఇద్దరు కొడుకులు" చిత్రానికి కె వి నారాయణరెడ్డి నిర్మాత

## విష్ణుప్రియా ప్రొడక్షన్స్‌వారి చిత్రంలో ఎ ఎన్. ఆర్. — లక్ష్మి

"జూలైలో షూటింగ్ మొదలెట్టి, సెప్టెంబర్‌లో ముగిస్తాం," అన్నారు జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి ఈయనిప్పుడు శోభన్‌బాబుతో కట్టా సుబ్బారావు దర్శకత్వంలో "కోరుకున్న మొగుడు" చిత్రం నిర్మిస్తున్నారు ఎ ఎన్ ఆర్ తో నిర్మించే చిత్రానికి సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు ఇందులో లక్ష్మి నాయిక

'కీర్తి—కాంత—కనకం'లో మంగళగౌరి



# నెస్టమ్ శిశువు జీర్ణానికి మంచిది

మీ పసిపాపకోసం
11 విటమిన్‌లు
ఇనుముగల
బియ్యంతో
తయారయిన
ఒకే ఒక పదార్థం.






ప్రకృతి సిద్ధమైన పద్ధతులలో మీ పాపని పెంచండి. ఇవ్వగలిగినంత కాలం పాపకి చనుపాలు యివ్వండి—మీరు ఇవ్వగలిగిన పుష్టికరమూ, సున్నితమూ అయిన ఆహారం అదే.

పాపకి 4 నెలలు వచ్చేసరికి ఎక్కువ పోషక పదార్థాలు కావాలి. ఘన పదార్థాలు తీసుకోడానికి పాప సిద్ధంగా వుంటుంది నెస్టమ్ గురించి, పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి నెస్టమ్ బియ్యంతో తయారు చేయబడింది —ఎంతో సులభంగా జీర్ణమయ్యే సీరియల్.

నెస్టమ్ బేబీ సీరియల్ రైస్— పాల నుంచి ఘన పదార్థాలకి సున్నితమైన మార్పు

## నెస్టమ్®
### బేబీ సీరియల్ రైస్

పాల నుంచి ఘన పదార్థాలకి
సున్నితమైన మార్పు

తయారు చేసే పద్ధతి.



ముందుగా మరిగిన వెచ్చని పాలు



పోయండి. నెస్టమ్ చేర్చండి.



కలపండి. తినిపించుటకు తయారు.

NESTLÉ

SAA/FSL/N/2257 TEL

## ంశ గౌరవంలో
## ిషమ సమస్య

విద్యుద్దీపాలతో అందంగా అలంకరించబడిన ృత్య కళాశాల ఆవరణలో శశి (విజయశాంతి), ుర్గ (జానకి), ఇద్దరు కార్యకర్తలు, కొందరు ిద్యార్థినులు ఎదురుచూస్తున్నారు ఇంతలో కారు వచ్చి ఆగింది అందులోంచి రవి (భానుచందర్) దిగాడు పూలమాలతో వచ్చిన శశి ాన్పైరపోయింది రవి కూడా నిర్ఘాంతపోయాడు ిశి చేతిలోని మాల జారిపోయింది గిరుక్కున ెనుతిరిగి, పరుగెత్తింది రవి అనుసరించాడు ందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు ఒకచోట ూలి పడబోయిన శశిని రవి పట్టుకున్నాడు 'శశీ! ఎంత దూరం పారిపోదామనుకున్నావు? ంత ఆరాటపెట్టావు, శశీ?''

''మీరు పొరబడ్డారు నేను శశిని కాదు, ా పేరు శారద,'' బలవంతంగా నిగ్రహించుకుంటూ ంది శశి

శశిని తనవైపు తిప్పుకుని, ''ఏదీ, ఆ మాట ా కళ్ళల్లోకి సూటిగా చూసి చెప్పు,'' అన్నాడు రవి

అతని చేతిని విదిలించుకుని, ''ఏమిటీ ార్జన్యం? నేను శశి కాదంటే వినరేం?'' ంది శశి

''శశీ! శశీ! శశీ! మళ్ళీ మళ్ళీ అదే మాట ెప్పి, నా గుండెను ముక్కలు చేయకు''

''మీ పొరపాటుకి నేను బాధ్యురాల్ని కాను''

''నువ్వు నిజంగా శారదే అయితే, నన్ను ూడగానే ఎందుకు పారిపోయావు?''

''ముక్కూ మొహం తెలియని వ్యక్తి 'శశీ' అని ెంటబడితే, ఆడపిల్ల ఏంచేస్తుంది?''



'ఇకనైనా మారండి'లో మురళీమోహన్, జ్యోతి

## సినిమా

''ఆత్మవంచన ఎందుకు, శశీ? నా హృదయంలో ప్రేమజ్యోతి వెలిగించిన శశి నువ్వు కాదా?''

''కాదు కాదు''

''నాతో ఆడిపాడి, నా గుండెల్లో అమృతం కురిపించిన శశి నువ్వు కాదూ?''

''కాదు కాదు కాదు,'' అంటున్నప్పుడు శశి కళ్ళు చెమ్మగిల్లాయి ''అమ్మా, మీరైనా చెప్పండమ్మా నేను శశిని కాదని,'' అంటూ చకితురాలైన దుర్గ దగ్గరికి వెళ్ళింది

''నిజమే, బాబూ! మీరు పొరబడి ఉంటారు ఈమె శారదే! చిన్నప్పటినుంచి మా నాట్యాలయం లోనే పెరిగింది,'' అంది దుర్గ

''మీ మీదుండే గౌరవం – మీ మాట నమ్మాలి అనిపిస్తున్నా, నా హృదయం మాత్రం అందుకు ఇష్టపడటంలేదు,'' అన్నాడు రవి నిట్టూరుస్తూ

''రండి, బాబూ, ఇప్పటికే ఆలస్యమైంది,'' అంది దుర్గ

''పదండి, మేడమ్! సారీ ఫర్ ది ఇన్‌కన్వీనియెన్స్''

శశి ఏడుస్తూ, లోపలికి నడిచింది ఆమె వెంట రవి, దుర్గ వెళ్ళారు

అభినయ ఆర్ట్స్ ''వంశ గౌరవం'' చిత్రం గురించి డైరెక్టర్ ఎన్ రవీంద్రరెడ్డి టూకీగ వివరిస్తూ, ''ఓ ఆస్పత్రిలో ఒక కోటీశ్వరుడి భార్య, మరో సాధారణ నర్సుకి ఒకేసమయంలో ఆడపిల్లలను ప్రసవించారు విధి ఆడిన వింత నాటకంవల్ల ఇద్దరూ కోటీశ్వరుడి కూతుళ్ళుగానే పెరిగారు ఆ ఇద్దరూ తన భార్యకు పుట్టిన కవలలే అని మురిసిపోతున్న ఆ కోటీశ్వరుడికి పదహారు సంవత్సరాల తర్వాత అసలు రహస్యం తెలిసింది వంశ గౌరవం కోసం ప్రాణాన్నయినా ఇచ్చే ఆయన హృదయంలో ప్రళయం ఆరంభమైంది ఎన్నో మలుపులు గల కథ,'' అన్నారు శోభన్‌బాబు హీరోగా ఏలూరి దుర్గాప్రసాద్ సమర్పించే ఈ చిత్రానికి జాగర్లమూడి సదిహారాయణరావు, రావి అంజనేయులు నిర్మాతలు

## "ఈశ్వరుడు – శనీశ్వరుడు"

దేసు వెంకట సుబ్బారావు సమర్పించే దాసాంజనేయ పిక్చర్స్‌వారి పై చిత్రానికి స్వర్గీయ బి ఆర్ పంతులు దర్శకుడు జెమినీ గణేశ్, శివకుమార్, జయలలిత, జయంతి ప్రభృతులు నటవర్గం వీటూరి రచయిత దాశరథి సంకలనకర్త డాక్టర్ ఇ ఎ రావు నిర్మాణ సారథి

## నటబ్రహ్మ ముక్కామల మృతి

సుప్రసిద్ధ, నాటక, చలనచిత్ర నటుడు, దర్శకుడు, నటబ్రహ్మ శ్రీ ముక్కామల కృష్ణమూర్తి జనవరి 13న మద్రాసులో ఒక స్టూడియోలో నటిస్తూ, గుండెపోటు వచ్చి మరణించారు

శ్రీ ముక్కామల కృష్ణమూర్తి 1919 ఫిబ్రవరి 28న గుంటూరులో జన్మించారు సుమారు మూడు దశాబ్దాలపాటు చలన చిత్రరంగంలో రెండువందలు పైగా చలన చిత్రాలలో విభిన్న పాత్రలను పోషించారు వారు నటించిన మొదటి చిత్రం మాయా మచ్ఛీంద్ర త్రిలోకసుందరి, పరోపకారం, విప్రనారాయణ, ధర్మదేవత, సర్వనాశాలు, ముత్యాల ముగ్గు మొదలయిన వాటిలో వారి పాత్ర పోషణ విశిష్టమైనది చాలా తమిళ చిత్రాలలో కూడా నటించారు

మరదలు పెళ్ళి, బుచ్చిబాబు శృంగార చిత్రాలకు దర్శకత్వం వహించారు శ్రీ ఎన్ టి ఆర్ శ్రీ జగ్గయ్య, శ్రీ కె వి ఎస్ శర్మలతో ఆంగ్ల నాటకాలలో ప్రముఖ పాత్రలు ధరించారు శ్రీ బళ్ళారి రాఘవ కూడా



వీరి నటనను ప్రశంసించారు 1943 లో గుంటూరులో నవజ్యోతి ఆర్ట్స్ ఎసోసియేషన్ కళా సంస్థను స్థాపించారు వీరికి ఒక కుమార్తె, కుమారుడు ఉన్నారు

## ట్రాలీలాగే వ్యక్తికి అంతిమ గౌరవం

బెంగాలీ అనే ట్రాలీలాగే వ్యక్తి (వయసు 55) చాలాకాలంగా బొంబాయి సినీ పరిశ్రమలో ఉంటున్నాడు. తన 12వ ఏట నుంచి ఈ వృత్తిలో ఉంటున్నాడట. ఏమాత్రం 'కుదుపు' లేకుండా ట్రాలీని నడపడంలో పేరు మోశాడు. "అతని చేతిలో ఏదో ఆర్ట్ ఉంది. దర్శకుని సృజనాత్మక కృషికి అతను విశ్వబద్ధంగా, నిలకడగా తోడ్పడేవాడు. కెమెరా టెక్నిక్‌లన్నీ అతనికి తెలుసు," అని దర్శక రచయిత సుభాష్‌గాయ్ ప్రస్తుతించాడు సుభాష్‌గాయ్, మనోజ్‌కుమార్ చిత్రాలకే ట్రాలీమాన్‌గా పనిచేసే బెంగాలీ ఇటీవల సుభాష్‌గాయ్ చిత్రం "విధాత"లో పనిచేయడానికి గోవా ఔట్‌డోర్ షూటింగ్‌కు వెళ్లినప్పుడు పచ్చకామెర్లతో హఠాత్తుగా కన్నుమూశాడు. చితికి సుభాష్‌గాయ్ స్వయంగా చితి అంటించి, ఆనాటి షూటింగ్‌ను రద్దు చేశాడు.

## సలీమ్ - జవేద్‌లు

సలీమ్ – జవేద్‌లు విడిపోయిన విషయం అందరికీ తెలిసిందే. ఇప్పుడు "కాళి" అనే హిందీ చిత్రాన్ని సలీమ్ నిర్మిస్తున్నాడు. దీనికి అతను ఎన్నడో జవేద్‌తో కలిసి స్క్రిప్టు తయారుచేశాడు. ఇందులో జీనత్‌అమన్ నాయిక. రవిటాండన్, దీపక్ బ్రాహి నిర్మించే మరో రెండు చిత్రాలకు కూడా సలీమ్ రచన సాగిస్తున్నాడు.

దిలీప్‌కుమార్, ఋషికపూర్ నిర్మించే "దునియా" చిత్రానికి, ముఖేష్‌భట్ నిర్మించే చిత్రానికి జవేద్ కధ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు రాస్తున్నాడు ★

'దొంగలొస్తున్నారు జాగ్రత్త'లో సరిత



సీరియల్

# జీవితవనంలో కొత్తగాలి

కుందుర్తి ఇందిరాదేవి

30

(గత సంచిక తరువాయి)

నాలో ఇది వరకు ఉండే భయం, సంకోచం అనేవి పటాపంచలయినాయి. బెరుకు అనేది అసలే లేదు. ఎటువంటి మాటకైనా ఘాటుగా సమాధానం చెప్తున్నాను. అది వయసు తెచ్చిన గాంభీర్యమేగానీ, లేకపోతే నా జీవితంలో నాకు తారసపడ్డ సంఘటనలే కానీ, నాలో పిరికితనాన్ని పోగొట్టాయి. నేను అమ్మతో మాట్లాడటం ఏనాడో మానివేశాను. "అమ్మా" అని ఎంతకాలం అయిందో!

ఉష సుధాకర్‌ని వివాహం చేసుకోబోతోందని తెలిసింది.

"అమ్మ ఒప్పుకోదు. కులం మంగలం చేయకు" అన్నాను.

"నాన్సెన్స్! అదంతా నాకనవసరం" తేలిగ్గా అంది ఉష.

"అమ్మ ఏడుస్తుంది."

"ఆవిడకి చేతనయింది అదేగా. అలాచేసే నీ జీవితాన్ని ఇలా చేసింది. నేను పిరికిదాన్ని కాదు" అంది రోషంగా.

నా ముఖం సిగ్గుతో కందిపోయింది.

"కానీ ఈ ఇంటి పరువుప్రతిష్ఠలు" అన్నాను.

"గో టు హెల్."

"ఉషా!" అది నా మాట వినిపించుకోలేదు.

"నీవు అసమర్థురాలిలా కిరణ్‌ని పెళ్ళిచేసుకోలేకపోయావు. అందరూ నీలాగే ఏడుస్తూ కూర్చోవాలా. నేను నీలాటి పిరికిదాన్ని కాదు. చేతకానిదాన్ని కాదు. వెధవముండకి దణ్ణం పెడితే 'నాలాగే పది కాలాలపాటు వర్ధిల్లు' అందట."

దానిమాట పూర్తి కానేలేదు. ఆగ్రహావేశాలతో వణికిపోతూ చాచిపెట్టి చెంప వగలగొట్టాను.

"అక్కా!" ఉషలో ఆవేశమంతా దిగిపోయింది

"గెటవుట్! ఐసే గెటవుట్ ఫ్రమ్ హియర్" పిచ్చెక్కినదానిలా అరిచాను. ఉష నిముషంలో మాయమైంది.

నేను చేతకానిదాన్నిట. అసమర్థురాలినట ఇదంతా ఎందుకోసం? వీళ్ళకోసమేగా నా జీవితాన్ని కూడా పణంగా పెట్టింది. దానికి ప్రతిఫలం ఈ మాటలు. ఎంత స్వార్థపరులు. నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

నా ఆవేశమంతా దిగిపోయింది. నేననుభవిస్తున్న రంపపుకోత చాలదు. అమ్మ ఒప్పుకోదు. నాలో ఒక రకమైన కసి బయలుదేరింది. ఉషకీ, సుధాకర్‌కి రిజిస్ట్రాఫీసులో మేరేజ్ జరిపించాను. శశి పురిటికి వచ్చింది ఆ సమయంలోనే. అమ్మ శిలా విగ్రహంలా నిలబడిపోయింది.

"అక్కడే ఆగు" అన్నాను. ఉష ఆశ్చర్యంగా చూసింది.

"ఉష కులంకాని వాడిని చేసుకుంది దాన్ని ఇంట్లో ఉంచుకుంటావో, బయటకి గెంటేస్తావో నీ ఇష్టం" అమ్మతో అనేసి వెళ్ళిపోయాను. అమ్మ ఆదరించింది, కారణం కన్నకూతురి జీవితం కోసం. గోత్రాలు కలవక్క అవి ఒకప్పుడు నాకు అభ్యంతరం పెట్టిన అమ్మ – నాకు తెలుసు వీళ్ళంతా తమ జీవితాల కోసం, సుఖాల కోసం నన్ను వాడుకున్నారు.

"నన్ను క్షమించక్కా. నీ మనసు తెలుసుకోలేకపోయాను" అంది ఉష నా గదిలోకి వచ్చి.

ఒకరోజు హనుమంతరావు పార్కుకి రమ్మని అడిగాడు. నేను సరేనని వెళ్ళాను. కూర్చున్నతర్వాత-

"నామీద మీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు

"ఏమీలేదు" అన్నాను నిశ్చలంగా.

"అంటే మీకు నామీద సదభిప్రాయం లేదా" అన్నాడు నిరాశగా.

"ఉంది! మీరు నా కొలీగ్. అంతే. ఇక ఏ అభిప్రాయం లేదు."

"మీరు ఎంత కాలం ఇలా ఉంటారు. మీకు ఇష్టమైతే మనం పెళ్ళి చేసుకుందాం." ఇటువంటి ప్రస్తావనేదో ఉంటుందని ముందుగానే అనుకున్నాను

"క్షమించండి. ఈ జీవితంలో ఇక పెళ్ళి ప్రసక్తి లేదు." అని లేచాను.

"మీరేమీ అనుకోకండి. నేనే తొందరపడ్డాను" అన్నాడు.

"ఇట్స్ ఆల్‌రైట్" అని వచ్చేశాను

నా మనసంతా చేదు తిన్నట్టుగా అయిపోయింది. ఇంటికి వచ్చి అలవాటుగా గోడవైపు చూశాను. ఖాళీగా ఉన్న గోడ నన్ను వెక్కిరించింది.

"అమ్మా" అని బిగ్గరగా అరిచాను.

ఇంట్లో అందరూ పరిగెత్తుకొచ్చారు. ఉష, సుధాకర్, శశి కూతురికి బొమ్మలు, బట్టలు కొనుక్కుని ఉదయం వచ్చారు. విజయవాడ నుంచి ప్రకాష్ వచ్చాడు. అందర్నీ చూసికూడా నేను కోపం అవుకోలేక –

"జీవితవనం ఏది" అన్నాను మండిపడుతూ

"స...సంధ్యా" అమ్మ తడబడింది.

"నువ్వు దాన్ని చూసుకుంటూ రోజు రోజుకీ సన్యాసినిలా తయారవుతున్నావు. అందుకే తీసి అవతల పెట్టేశాను" అంది శశి.

"షటప్!" నేను బిగ్గరగా అరిచాను. శశి ముఖం ఎర్రబడింది.

"వెళ్ళు... వెళ్ళి తక్షణం ఆ ఫోటో తెచ్చి అక్కడ తగిలించు" అన్నాను. ఫల్గుణ పరిగెత్తుకుంటూ వెళ్ళి దాన్ని తెచ్చి గోడకి తగిలించాడు.

శశి కళ్ళు వత్తుకుంటుంటే అమ్మ సహించలేక—

"అది నీ మేలు కోరేగా చేసింది. దానికే ఇంత రాద్ధాంతమా" అంది.

"ఎవరి హద్దుల్లో వాళ్ళుంటే ఏ రాద్ధాంతమూ కాదు" అన్నాను.

"ఆ దిక్కుమాలిన బొమ్మ ఎదురుగ్గా పెట్టుకుని మమ్మల్ని ఇలా సాధిస్తావేమిటే" అమ్మకి హఠాత్తుగా ఏడుపు వచ్చేసింది.

నాలో ఆగ్రహం కట్టలు తెంచుకుంది. నేను సాధిస్తున్నానుట – అందుకే నిర్లక్ష్యంగా అన్నాను –

"నా జీవితంలో నాకు మీరు మిగిల్చిన అపురూపమైన జ్ఞాపకం అదొక్కటేనమ్మా. ఆ జీవితవనం చూసుకుంటూ, నాటి తాలూకు జ్ఞాపకాలతో బ్రతుకుతున్న జీవచ్ఛవాన్నమ్మా నేను మీరు నాకు ఏ ఉపకారం చెయ్యద్దు. నా వస్తువుల



**జరిగిన కథ - 14 :** కుటుంబ భారం తనపై వేసి తండ్రి కన్నుమూయగా, సంధ్య ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్ళను పోషిస్తూ వాళ్ళకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది. ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుర్చు తొడుగుతుంది. శశి చదువు పూర్తయి ఉద్యోగంలో చేరగానే ఆమెకు ఆ ఇంటి బాధ్యత అప్పగించి సంధ్యా, కిరణ్‌లు పెళ్ళి చేసుకొని తామూ సహాయపడాలని నిశ్చయించుకొంటారు. ఉద్యోగంలో చేరి ఆ ఇంటికి ఆధారం అవుతుందనుకొన్న శశి, ప్రకాష్‌ని పెళ్ళి చేసుకొని వెళ్ళిపోవడంతో, దిక్కుతోచని పక్షిలా విలవిలలాడిపోతుంది సంధ్య. శశికి ఉద్యోగం వస్తే, తన అత్తగారికి ఇష్టం లేకపోవడంతో చేయనని ఖచ్చితంగా చెప్పేసి వెళ్ళిపోతుంది. కిరణ్‌కి బొంబాయి ట్రాన్స్‌ఫర్ అవడంతో మరీ కృంగిపోతుంది సంధ్య. సంధ్యా కిరణ్‌లు పెళ్ళి చేసుకోవడం ఇరు కుటుంబాలకూ ఇష్టంలేదు. కిరణ్ వివాహ ఆహ్వాన శుభలేఖ అందుకొని మూర్ఛపోతుంది సంధ్య. కమలతో కిరణ్ వివాహం జరగటం, ఓ మగపిల్లవాణ్ణి ప్రసవించి కమల చనిపోవడం, కొడుకును సుగుణ కప్పగించి కిరణ్ పారిస్ వెళ్ళిపోవడం వెంటవెంటనే జరిగిపోతాయి. సంధ్య జీవితం మామూలే. ఈలోగా ఉష తమ కులం కానివాణ్ని ప్రేమించి 'నువ్వు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా అతన్నే పెళ్లి చేసుకుంటాన'ని సంధ్య మొహంమీదే చెప్పేస్తుంది.



జోలికిరాకండి. నా గదిలో ఏ వస్తువులు ముట్టుకున్నా నేను సహించను'' అనేసి భళ్ళున తలుపులు మూశాను.

బయట ప్రకాష్, సుధాకర్ అమ్మా వాళ్ళని సుందరిస్తున్నారు. ఆ అమ్మాయి జీవితం అలా అయిపోయింది. మీరుకూడ ఎందుకు ఏడిపిస్తారు అంటూ చివాట్లు వేస్తున్నారు.

నేను వాళ్ళు ఎంత ఇంటి అల్లుళ్ళయినా అసలు మాట్లాడను. నాకా అవసరంలేదు. నాకు చేతనయింది చేశాను అంతే.

* * *

''నేను పెళ్ళి చేసుకోబోతున్నాను'' అంది విమల

''అచ్ఛా! ఎవరా దురదృష్టవంతుడు'' అన్నాను నవ్వుతూ.

''నీకూ తెలుసు.''

''నాకా! ఎవరతను ఏంచేస్తుంటాడు'' అన్నాను ఆశ్చర్యంగా.

''చెప్పకో చూద్దాం'' ఊరించింది విమల. అయినా నేనా దొరికేది.

''ఇంతకీ సినిమాల పిచ్చి మొగుడేనా'' అన్నాను.

''నాకు వారానికో సినిమా చూపించాలి. అదీ రిలీజ్ రోజే అని ముందుగానే అన్ని షరతులూ పెట్టాకే ఒప్పుకున్నాను'' అంది చిలిపిగా.

''అబ్బో! ఎవరా ప్రేమపూజారి.''

''మన హనుమంతు.''

నేను ఎగిరిపడ్డాను, ''మై గాడ్ మన మంకీ'' అన్నాను నమ్మలేనట్టు.

''మన మంకీనే. మంకీ అయితే చెప్పిన మాట వింటాడు. మన ఎర్రకోతినే చేసుకునేది'' అంది.

''మన మంకీ! ఎర్ర కో తి ని .. సారీ హనుమంతు... సారీ హనుమంతురావుగారినా ..'' అన్నాను బిత్తరపోతూ.

''అవునోయ్ సంధ్యారాణీ! చూడు అతను నా కాబోయే మొగుడయినా మన భాషలో మనకి మంకీనే... ఎర్రకోతే'' అని పకపకా నవ్వుతూ ''నువ్వు హనుమంతురావుగారు అని గౌరవిం చక్కర్లేదు'' అంది.

విమల నిష్కల్మషమైన హృదయానికి నేను జోహారు లర్పించకుండా ఉండలేకపోయాను.

ఇంటికి రాగానే ప్రమీల ఉత్తరం ఎదురు చూస్తోంది. ఉత్సాహంగా చూశాను. అందులో ''ఇక్కడేదో సంబంధం ఉంది. మీ అన్నయ్యకి బాగా తెలుసు. చాలా మంచివాడు. నిన్ను ఎలాగైనా పెళ్ళికి ఒప్పించమని మీ అన్నయ్య ఒకటే గోల పెట్టేశారు. నువ్వు ఎంతకాలం ఇలా ఉంటావు. నువ్వు వెంటనే నీ అంగీకారం తెలుపుతూ ఉత్తరం వ్రాయి'' అంటూ రాసింది.

ఛట్! ఏ ఒక్కరు నన్ను శాంతిగా బ్రతక నియ్యరు. ఈ జీవితంలో పెళ్ళి ప్రసక్తేలేనేలేదు అని వ్రాసి పడేశాను. అనుక్షణం నా సుఖం కోసం తాపత్రయపడే నా ప్రాణస్నేహితురాలికి నేనిచ్చే సమాధానం అది మరి నేనేం చెయ్యగలను మీరే చెప్పండి ?

## 31

''అమ్మా! అక్కకి నువ్వే చెప్పమ్మా ప్లీజ్'' ఫల్గుణ బ్రతిమాలుతున్నాడు. వంట ఇంట్లోకి రాబోయిన నేను రక్కన ఆగిపోయాను.

''అంత ధనవంతులమ్మాయిని చేసుకోడం మంచిది కాదురా'' అంటోంది అమ్మ

''అన్నిటికీ ఇలా వంకలు పెడుతూనే ఉంటావు సంధ్యక్క పెళ్ళిచేసుకోను అని భీష్మించుకుంది మరి మేమెంత కాలం ఆగాలి ?''

ఈ మాటలంటున్నది నా తమ్ముడు ఫల్గుణేనా! ఛీ! ఛీ! ఏం మనుష్యులు. అమ్మ సణుగుతూ చెప్పింది. నేను కాఫీ తాగుతూ -

''ఎవరా అమ్మాయి ?'' అన్నాను

''ఎవరో రామారావుగారి అమ్మాయి రాణీట'' అంది.

''అక్కా! నీకు ఇష్టమైతే నే చేసుకుంటా ను'' అన్నాడు తల దించుకుని.





మా కొత్త ఆఫీసరు ఈ రోజు జాయిన్ అవుతార్ట ఆయనకు భజన చేస్తుంటే పని చేయక పోయినా ఫర్లేదట

MANAGER

ఇవాళ పెందలాడే వచ్చి కూర్చున్నాడు గురుడికి ఇంటిదగ్గర పొద్దుటే పడ్డయన్నమాట అక్షింతలు!

---



# జీవితవనంలో కొత్తగాలి

"ప్రేమించేటప్పుడు, ఆ అమ్మాయితో షికార్లు చేసేటప్పుడు నా ఇష్టం అడిగే చేశావా ఫల్గుణా !" అన్నాను చాచి చెంప పగలగొట్టినట్టుగా.

అమ్మ విజయవాడ నుంచి శశిని, ప్రకాష్‌ని పిలిపించింది. తాంబూలాలు పుచ్చుకున్నారు. పెళ్ళికి నన్ను బలవంతాన తీసుకువెళ్ళారు. తాంబూలాలప్పుడు నన్ను రమ్మని ప్రాధేయపడ్డాడు ఫల్గుణ.

"నేను పెద్ద ముత్తయిదువను కాదులేరా" అని తిరస్కరించాను. పెళ్ళికి కూడా రాకపోదును "నువ్వు రాకపోతే నేను పెళ్ళే చేసుకోను" అని మొండికేయటంతో వెళ్ళాను. పెళ్ళవగానే ఫల్గుణ మొదటిసారిగా నాకు నమస్కరించి "నన్ను ఇంత వాడిని చేసిన దేవతవక్కా" అన్నాడు. నా కళ్ళల్లో నివ్వున నీళ్ళు తిరిగాయి.

మీనా నా దగ్గరికి వచ్చి "ఆఖరికి అన్నయ్య కూడా పెళ్ళి చేసుకున్నాడక్కా. నువ్వే మిగిలి పోయావు" అంది. నేను మీనా భుజంమీద ఆప్యాయంగా తట్టాను.

ఇంటికి వచ్చి నా గదిలో సామానంతా సర్దసాగాను. ఇది ఫల్గుణకి ఇచ్చెయ్యాలి. తప్పదు. ఇంతలో కుంచిచీపురు కోసం ముందు గదిలోకి వచ్చాను. వంట ఇంటిలోనుంచి మెల్లిగా ఏడుపు వినిపిస్తోంది. నేను చెవులు రిక్కించి నిలుచున్నాను.

"ఇంత బ్రతుకూ బ్రతికి ఇల్లరికం వెడతావురా" అంటోంది అమ్మ.

"ఈ ఇంట్లో అయితే ఆయన ప్రాక్టీసు పెట్టినట్టే. మా డాడీ మాకు అన్ని వసతులూ ఏర్పాటుచేసి కొంతకాలం ఇంట్లో ఉండమన్నారు. దానికి ఇంత ఏడుపెందుకు ?" రాణీ మూడిస్తోంది. ఆ పిల్ల నోటికి అదుపులేనట్టుంది.

"అమ్మా ఇప్పుడా గది సర్దవద్దని అక్కతో చెప్పమ్మా" అంటున్నాడు వాడు.

"నావల్ల కాదురా" అమ్మ ఏడుస్తోంది.

"ఏం అవిడంటే ఎవరికి భయంట. నేనే వెళ్ళి చెప్పేస్తాను" అంది రాణి.

"ప్లీజ్ కాస్త పొలైట్‌గా చెప్పు" బ్రతిమాలుతున్నాడు ఫల్గుణ.

నేను గిర్రున తిరిగి వచ్చేశాను. వాడు వెళ్ళిపోతున్నాడు. పోనీ, ఎవరికి ఎంత ఋణమో! అనుకోసాగాను. వాడి చదువు గురించి నేను చేసిన అప్పులు నా నెత్తిన రుద్ది వెళ్ళిపోడానికి వాడికి సిగ్గెలా లేకపోయింది అనుకున్నాను అసహ్యంగా.

గోడమీద బూజు దులుపుతుంటే రాణీ వచ్చింది. "ఎందుకండీ వదినగారు మీకింత శ్రమ మాకోసం కష్టపడి గది తయారుచేస్తున్నారు" అంది.

నేను స్టూలుమీద నిలబడి ఉన్నదాన్ని ఒకసారి రాణికేసి నిరసనగా చూసి మళ్ళీ బూజు దులుపుతూ "నాకు ఇలా బూజుంటే అసహ్యం. అందుకే శుభ్రంగా నీట్‌గా ఉండటానికి గది సర్దుకుంటున్నాను. మీకోసం అని ఎందుకనుకున్నావు" అన్నాను పకపకా నవ్వుతూ.

రాణి ఉక్రోషంగా "ఇలాటి చిన్న గదుల్లో ఉండాల్సిన ఖర్మ మాకేం పట్టిందండి. మా డాడీకి లంకంత కొంప ఉంది. సాయంత్రం వెళ్ళిపోతున్నాము" అనేసి వెళ్ళిపోయింది.

ఆ అమ్మాయి ఆటలు నేను సాగనివ్వలేదని కోపం వచ్చినట్టుంది.

భోజనాల సమయంలో ఫల్గుణ అమ్మని "ప్లీజ్ చెప్పమ్మా" అంటూ సైగ చేస్తూనే ఉన్నాడు.

నేను అన్నం కలుపుకుంటూ "అమ్మా! ఫల్గుణకి ఇవ్వాల్సినవన్నీ సర్దేశావా వాడికి ఆవకాయ అంటే చాలా ఇష్టం" అన్నాను.

అందరూ నిర్ఘాంతపోయారు. ఫల్గుణ ముఖం మాడిపోయింది. నాలో ఆదోరకమైన పైశాచికమైన ఆనందం కలుగుతోంది.

"శశికి ఒడియాలంటే ప్రాణం అంటూ అత్తగారింటికి పంపేదానివి. ఫల్గుణ అత్తగారికి ఆవకాయ పెట్టడం వచ్చో రాదో — పిండివంటలు ఏం చేశావు. ఏదైనా స్వీట్ చేయి. లేకపోతే బజారు నుంచి తెప్పించు" అన్నాను.

అమ్మ శిలావిగ్రహంలా చూస్తోంది. రాణీ ఉలుకూ పలుకూ లేకుండా వింటోంది. మీనా నవ్వుతోంది.

"ఒరేయ్ ఫల్గుణా! ఇక్కడలా అక్కడ ప్రవర్తిస్తే కుదరదు. జాగ్రత్తగా, అణుకువగా ఉండాలి. ఏమ్మా రాణీ మావాడసలే కాస్త మొహమాటస్తుడు, ఏం కావాలో నువ్వే స్వయంగా కనుక్కో."

"సంధ్యా!" అమ్మ సహించలేనిదానిలా బిగ్గరగా అరిచింది.

నేను ఆశ్చర్యం నటిస్తూ "తప్పేగా చెప్తానామ్మా. నువ్వు శశిని అత్తగారింటికి పంపేటప్పుడు ఇలాగే కదమ్మా చెప్పింది. ఇకనుంచి వాడు అత్తగారింట్లో ఉండాల్సినవాడేగా. అందుకే పంపేటప్పుడు మనం మంచీ చెడూ చెప్తే రేపు మనకు మాట తీసుకురాకుండా ఉంటాడు" అనేసి చేయి కడుక్కుని వెళ్ళిపోయాను.

నిజంగా వాడికి రోషం, అభిమానం అనేవి ఉంటే వాడు అప్పటికైనా వాడి ప్రయాణం మానుకునేవాడు. కానీ వాడికి మామగారు సృష్టించి ఇచ్చిన స్వర్గం వాడి రోషం, అభిమానాన్ని కూడా అవతలకి తోసేసి వెళ్ళిపోయేట్టు చేసినాయి

అందరూ వెళ్ళిపోయారు. నేను వదిలించుకుందామన్నా సాధ్యం కాని ఈ బాధ్యతలు, బంధాలు, అవసరం తీరగానే వాటంతట అవే తెగిపోయాయి అందరూ రెక్కలు వచ్చిన పక్షుల్లా ఎగిరిపోయారు. ఆఖరికి వంశం నిలబెట్టాల్సిన కొడుకు అని కలలు కనే తల్లిదండ్రులు మా ఫల్గుణ లాంటివాడిని చూసి ఏంచేస్తారు? మా అమ్మలాగే నిస్సహాయంగా లోపల్లోపలే కుమిలిపోతారు. మా మీనా ఏంచేస్తుందో మరి? దిగులుగా అనుకున్నాను.

## 32

ఒకసారి రాణీ, ఫల్గుణ వచ్చారు. అమ్మని, నన్నూ తనదగ్గరికి వచ్చెయ్యమని బ్రతిమాలాడు. నేను అంగీకరించలేదు. నేను పెళ్ళికి ఒప్పుకోననే కోపంతో అమ్మ "నేను పోతాను" అంది.

"నిరభ్యంతరంగా వెళ్ళు" అన్నాను.

"మరి ఒంటరిగా ఎలా ఉంటావు" అంది.

"నాకేం భయం లేదు."

"మరి నీ తిండి" అంది మళ్ళీ.

"వంటమనిషిని పెట్టుకుంటాను" అన్నాను

అమ్మ ఏమనుకుందో ఫల్గుణ దగ్గరికి వెళ్ళలేదు. వాడికి వాళ్ళ మామగారు ఒక ఇల్లు ఇచ్చారు. డిస్పెన్సరీ కూడా ప్రస్తుతం అక్కడే. పక్కనే హాస్పిటల్ కూడా కట్టిస్తాను అన్నాడట

నా అప్పులు తీరిపోతుండటంతో నేను ఒక డైనింగ్ టేబుల్ కొనుక్కున్నాను. ఫ్యాన్ కొన్నాను ఫల్గుణ ఎన్నోసార్లు నాకు డబ్బు ఇవ్వబోయాడు నేను అక్కర్లేదు అని మృదువుగానే తిరస్కరించాను

"నా చదువుకి నువ్వు ఎన్నో అప్పులు చేశావు. అదయినా తీర్చుక్కా" అన్నాడు అభిమానంగా.

"నేను నాన్నగారికి మాట ఇచ్చిన ప్రకారం మిమ్మల్ని చదివించాను. పెళ్ళిళ్ళు చేసి అత్తారింటికి పంపించాను. నేను ప్రతిఫలం అంటూ ఏనాడూ మీనుంచి ఆశించలేదు. నేను చేసిన అప్పులు నేను ఏనాటికైనా తీర్చుకోగలను" అన్నాను నిర్మొహమాటంగా.

ఫల్గుణ తలవాల్చుకుని వెళ్ళిపోయాడు.

"పోనీ ఎంత కాలం ఈ బాధ్యతలు భరిస్తావు. మీనాని నేను తీసుకువెడతాను" అన్నాడు ఇంకోసారి.

"నో! పంపను. దానికి కూడా నేను గార్డియన్‌ని. అయినా అది వస్తానంటే తీసుకు వెళ్ళు" అన్నాను.

మీనా "అక్కని ఒంటరిగా వదిలిరాను" అంది ఖచ్చితంగా.

ఫల్గుణ హతాసుడయ్యాడు. నేను ఎవరికీ లొంగలేదు. ఫల్గుణ ఎన్ని ప్రయత్నాలు చేసినా నేను దేనికీ అంగీకరించలేదు. ఒకసారి పండక్కి పిలిచి చీర పెట్టాడు. నేను అది ఉషని పిలిచి పెట్టాశాను.

సంక్రాంతికి శశి వచ్చింది పిల్లల్ని తీసుకుని. సాయంకాలం రాణి, ఫల్గుణ వచ్చారు. పండక్కి ఉన్నారు. నేను ఓ రోజు సాయంకాలం ఆఫీసునుండి వచ్చేసరికి అప్పుడే శశి కొడుకు ఎదురు వచ్చాడు చేతులు చాచుకుంటూ నేను వాడిని అసలు దగ్గరికి తియ్యలేదు. తప్పించుకుని వచ్చేశాను. నాకు పిల్లలంటే ఎంత ప్రాణమో! కానీ అదేమిటో నా చెల్లెలి పిల్లలయినా గూడా నేనేనాడు ఎత్తుకోలేదు. ఏమీ కొనిపెట్టలేదు. నా కసలు అది ఇష్టంలేదు.

బ్యాగ్ చిలక్కొయ్యకి తగిలించి యథాలాపంగా, అలవాటుగా తలెత్తి చూశాను. గోడమీద జీవిత వనంలేదు.

"అమ్మా" నేను బిగ్గరగా అరిచాను.

అమ్మ పరిగెత్తుకొచ్చింది. నేనా పిలుపు మానేసి చాలా కాలమైంది. అమ్మా అని ఆప్యాయంగా పలకటమే మానేశాను.

"నా జీవితవనం ఏదీ! ఎవరు తీశారు?" తీక్షణంగా అన్నాను.

రాణి వచ్చింది. "నేనే తీశాను. చాలా బాగుందా ఆర్ట్. నేను తీసుకువెడతాను" అంది.

"అమ్మా! నా గదిలో వస్తువులు ముట్టుకో వద్దని ఎన్నిసార్లు చెప్పాను. వెంటనే ఆ చిత్రం తీసుకురా. ఊ క్విక్" అన్నాను.

అమ్మ నిముషంలో దాన్నితెచ్చి గోడకి తగిలిస్తూ "వద్దని ఎంత చెప్పినా వినుకోలేదు" అని గొణుక్కుంటోంది.

రాణి ముఖం అవమానం జరిగినట్టుగా కంది పోయింది.

"ఎవడిక్కావాలిట. ఆ బోడి గీతలు. డబ్బు పారేస్తే బజార్లో ఇన్ని దొరుకుతాయి" అంది ఉక్రోషంగా.

"మంచిది! అలాగే కొనుక్కో. నేను పేద పిల్లని. అలాంటి విలువైనవి ఇచ్చుకోలేను. దానం చెయ్యలేను. మీ నాన్న బాగా డబ్బున్నవాడేగా! కోరింది కొనుక్కో. మీ ఆయన కూడా బాగానే సంపాయిస్తున్నాడుగా. హైదరాబాద్‌లో ఉన్న చిత్రాలన్నీ కొనుక్కో. నేనేం కాదను. కానీ ఆ జీవితవనం మీద చెయ్యివేసినా నేను సహించను" కఠినంగా అన్నాను.

"దిసీజ్ టూ మచ్" అంది రోషంగా.

నేను బాత్‌రూమ్‌వైపు వెళ్ళబోతూ "యూ మే గో అవుట్" అన్నాను. రాణి విసురుగా వెళ్ళి పోయింది.

మీనా వచ్చి టిఫిన్‌కి రమ్మంది. వెళ్ళి డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాను.

"అక్కా! ఎంత కాలం ఇలా ఒంటరిగా ఉంటావు" ఫల్గుణ ప్రారంభించాడు.

"నేను చచ్చేంతవరకూ" అన్నాను టిఫిన్ తింటూ.

"ఇది చాలా అన్యాయం" అన్నాడు చిరుకోపంగా.

"ఇందులో న్యాయం, అన్యాయం అనే ప్రసక్తే లేదు."

"మేమంతా జీవితంలో స్థిరపడిపోయాము అమ్మ నీగురించి ఎంత బాధపడుతోందో తెలుసా?"

"నాన్సెన్స్! నాకేం నేను బ్రహ్మాండంగా ఉన్నాను సంపాయించుకుంటున్నాను. తింటున్నాను ఓపికుంటే ఇంత ముష్టి పారేస్తున్నాను."

ఫల్గుణ కొరడా దెబ్బలు తిన్నవాడిలా చూస్తూ—

"పోనీ అక్కా! నీకంటూ తోడు ఎవరో ఒకరు కావాలిగా" అన్నాడు.

"అంత ఒంటరితనమే వస్తే, భరించలేకపోతే డార్జిలింగ్ వెళ్ళిపోతాను."

"డార్జిలింగా!"

"అవును. నాకోసం ప్రమీల ఇంటి తలుపులు ఎల్లప్పుడూ తెరిచేవుంటాయి. నేను వెళ్ళాలేగానీ నన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటుంది."

ఎవ్వరూ మాట్లాడలేదు.

"సంధ్యా, నిన్ను పెంచుకుంటాను అని ప్రమీల నాతో ఎన్నోసార్లు అందికూడా" అన్నాను. ఇందులో మీరెవరూ నన్ను ఆదుకోరు అని స్పష్టంగా తెలియ జేశాను.

"విజయవాడలో మంచి సంబంధం ఉందమ్మా. ముఖ్యంగా నేను పనిమీదే హైదరాబాద్ వచ్చాను సంధ్యను చేసుకోమని అడిగితే, సరేనన్నాడు. కాకపోతే రెండో పెళ్ళివాడు. అంతే. కట్నంకూడా వద్దన్నాడు" అంది శశి. ఈమధ్య ఈ మహిళా సమావేశాల్లో చేరి ఇటువంటి వెధవ రాజకీయాలు ఒంటబట్టించుకున్నట్టుంది.

"మీ అక్క పెళ్ళి ఎందుకు చేసుకోలేదు. ఏమైనా జబ్బా" అని మొన్న మా అత్తగారు అంటుంటే తల ఎత్తుకోలేకపోయాను" ఫల్గుణ కోపంగా అన్నాడు.

"సరి! సరి! మీ అత్తగారు నయం. మా అత్తగారయితే మరీను ఆ ప్రేమించినవాడితో ఏదో సంబంధం ఉంది. అందుకే ఈ పిల్ల పెళ్ళి చేసుకో లేదు అన్నారు" అంది శశి బాధపడిపోతూ.

నేను మాట్లాడలేదు. మౌనంగా కాఫీ తాగుతున్నాను.

"మీ అక్క ఇలాటిది — అని అంటుంటే ఎంత అవమానంగా ఉందో తెలుసా? మా అత్తగారి






# కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

## జీవితవనంలో కొత్తగాలి

ముందు తల ఎత్తుకోలేకపోయాను. ఏళ్ళు మీదపడుతున్నాయి, పెళ్ళెప్పుడు అని అందరూ అడగటమే?"

నేను కాఫీకప్పు క్రింద పెట్టేసి "అచ్ఛా" అని ఫక్కున నవ్వాను. ఫల్గుణ అదిరిపోయాడు. ముఖం కందగడ్డలా చేసుకున్నాడు.

"ఏరా ఫల్గుణా, అక్కకి పెళ్ళి కాకుండా చదువు పూర్తవగానే కొంపలంటుకుపోయినట్టు పెళ్ళి చేసుకున్నప్పుడు గుర్తురాలేదా? మీ అత్తగారి ముందు ఈరోజు నీ కవమానమయిందా. మీ అత్త గారికి ఆమాత్రం బుద్ధిలేదు, అలా అనటానికి" అన్నాను.

ఫల్గుణ ఎవరైనాసరే గట్టిగా మాట్లాడితే నోరు ఎత్తడిక. నేను శశివైపు తిరిగాను.

"ఏమే శశీ! నన్ను రెండో పెళ్ళివాడికిచ్చి చేస్తావా? ఎంత జాలిగుండె నీది. బాధ్యతలు, బంధాలు అంటూ కబుర్లు చెప్తూనే పచ్చి స్వార్థపరురాలిలా గుళ్ళో పెళ్ళి చేసుకొని వెళ్ళిపోయిన నువ్వు నాకు నీతులు చెప్తావా? ఈ కుటుంబాన్ని ఆదుకోవే అని చివరికి సిగ్గూ లజ్జా అన్నీ విడిచి ఏడిచినా కూడా "మా అత్తగారికి ఇష్టంలేదు" అని వెళ్ళిపోయిన్నాడు ఈ అక్క గుర్తురాలేదా" అన్నాను.

శశి నోటికి పక్షవాతం వచ్చినట్టు చూడసాగింది. నేను మళ్ళీ అన్నాను.

"నాకు ఈ ప్రపంచంలో నా కిరణ్ తప్ప ఇంకే వెధవతోనూ పరిచయం కూడా లేదని నీకు తెలీదు! అయినా మీ అత్తగారికి నన్ను అనే అధికారం ఎవరు ఇచ్చారే! అవును నేను చెడిపోయాను. నిజంగా చెడిపోయాను. మీకోసం, మీ స్వార్థం కోసం నేను పూర్తిగా చెడిపోయాను. అనుక్షణం ఆత్మవంచన చేసుకుంటూనే, నా కిరణ్‌ని కూడా ఒదులుకుని బ్రతుకుతున్నాను. పెద్దదానివి అని నా నెత్తిన కిరీటం పెట్టి మీరందరూ దాటుకున్నారు. చివరికి మీరు నాకు శ్రీరంగనీతులు చెప్తున్నారు. నేను పంచుకున్న ఈ బాధ్యతలు, ఈ బరువులు మీలో ఎవరైనా పంచుకున్నారేమో గుండెలమీద చేయి వేసుకుని చెప్పండి.

మీరు నా జీవితం నాశనం చేశారు. నన్ను జలగల్లా పీక్కుతిన్నారు. కాబట్టి శశీ నోరుంది కదాని వాగటం కాదే. కాస్తంత ఆలోచించుకోవాలి. ఆ రోజే నేను నా కిరణ్‌తో వెళ్ళిపోతే మీరంతా ఏం చేసేవారు. మీ చదువుల కోసం, బట్టల కోసం, తిండి కోసం, పుస్తకాల కోసం ఎన్ని అప్పులుచేశాను. చివరికి అందరూ ఏమీ పట్టనట్టు అన్నీ నా నెత్తిన రుద్ది వెళ్ళిపోయారు. అప్పుడు కూడా నేనేమైనా అన్నానా" నాకు హఠాత్తుగా దుఃఖం వరదలా వచ్చేసింది.

"నా బాకీ ఎంతో చెప్తే తీర్చేస్తాలే అక్కా" రోషంగా అంది శశి.

నేను ఛర్రుమన్నాను. "తీర్చమని నేనడగలేదు. అది నా బాధ్యత అని మీరంతా అన్నారు. పోనీండి! ఏం చేద్దాం. ఆల్‌రైట్ ఇదంతా మీ బాకీ తీర్చానని సరిపెట్టుకుంటాను" అని గదిలోకి పారిపోయాను.

బయట ఆపైన చిన్న చిన్నగా మాటలు తప్పించి ఏం జరగలేదు. ఈ మనుషులమీద, మనస్తత్వాలమీద నాకు పట్టరాని ఆగ్రహం కలగసాగింది.

* * *

శశి పండక్కి బట్టలు పెట్టలేదని, అందరిలో తనకు అవమానంగా ఉందని ఏడిచింది. నేను వాచీ పెట్టుకుంటూ –

"అమ్మా అన్నం వడ్డించు" అన్నాను కుర్చీలో కూర్చుంటూ.

"పెళ్ళయి ఇన్ని సంవత్సరాలైనా ప్రకాష్‌కి ఒక్కసారన్నా బట్టలు పెట్టలేదు. నా పిల్లలకి ఒక్క బొమ్మ కొనిపెట్టలేదు" అంది రోషంగా.

అమ్మ కళ్ళు వత్తుకుంటుంటే నాకు కష్టం వేసింది.

"నీ పుట్టింటివాళ్ళు చాలా పేదవాళ్ళని నీకూ తెలుసుగా" అన్నాను.

ప్రకాష్ వారిస్తున్నా శశి ఊరుకోలేదు "నువ్వు సంపాయిస్తూనే ఉన్నావుగా" అంది. నేను విచిత్రంగా చూస్తూ నవ్వాను.

"నా సంపాదన మీకు ధారపొయ్యాలనిలేదే అసలు నాకేమవసరం?"

"నాన్నే ఉంటే ఇలా చేసేవారా" అంది కోపంగా ఏడుస్తూ.

నేను ఛర్రున లేచాను. "అవును. నాన్నే ఉంటే నా బ్రతుకిలా అయ్యేదా! నేను సంపాయించిందంతా మీకు దానం చెయ్యాలని నా మొహాన ఏమైనా రాసిపెట్టి ఉందా. నీకేమైనా నేను బాకీనా. జాగ్రత్త. నీవేకాదు. నేనూ ఈ ఇంటి ఆడపిల్లనే. నా కన్నతండ్రి ఉంటే నేను ఇలా మీ స్వార్థానికి బలైపోయేదాన్నా. శశీ ఇష్టం వచ్చినట్టు వాగి నాకు కోపం తెప్పించకు. మెండ్ యువర్ టంగ్" అనేసి కూర్చుని అన్నం కలపసాగాను. నా మనసు కుతకుతలాడుతోంది.

అమ్మ పచ్చడివేస్తూ "పోనీవే సంధ్యా. ఆడపిల్ల ఆమాత్రం ఆశపడటం తప్పుకాదు కనీసం దానికి, పిల్లలకీ, బట్టలయినా..."

నాకు కోపం ఉస్సున వచ్చింది. "నాన్సెన్స్. పెళ్ళయి ఇన్నేళ్ళయి అదిలేదు, ఇదిలేదు అని నా ప్రాణాల్ని తియ్యటానికి సిగ్గులేదు. కష్టపడి అప్పులు చేసి అయినా బి.ఎస్‌సి. చదివించాను. ఆ చదువంతా గంగలోకలిపి ఇంకా నామీదపడి ఏడవటానికి కాస్తయినా సిగ్గు, లజ్జా అనేవి ఉండాలమ్మా. నేను చచ్చినాకూడా ఒక్క చిల్లిగవ్వకూడా ఇవ్వను" అనేసి నిండు కంచంలో చెయ్యి కడుక్కుని కుర్చీని ఒక్క తన్ను తన్ని గదిలోకి వచ్చేశాను.

ప్రకాష్, శశీ పోట్లాడుకుంటున్నారు. ప్రకాష్ "నోర్ముయ్! ఆ అమ్మాయిని పీడించటానికి సిగ్గులేదు" అని మొట్టమొదటిసారిగా తిట్టిన తిట్టు నేను చెప్పులు వేసుకుంటూ విన్నాను. శశి నోరు ఇక వినిపించలేదు.

వెనక అమ్మ "సంధ్యా... సంధ్యా... అన్నం తిని వెళ్ళవే" అని వెంటబడుతున్నా నేను వినిపించుకోకుండా భగభగలాడే మనస్సుతో ఆఫీసుకి వెళ్ళిపోయాను

**(ఇంకా వుంది)**

# JOHNSON®

# మిక్సర్ గ్రైండర్

## దక్షిణ ఇండియా వంట పనులను కూడా దిట్టంగా యెదుర్కొన తయారైంది

దక్షిణ ఇండియా వంట పనుల అవసరములను దిట్టంగా యెదుర్కొనుటకు తగిన శక్తి గలిగియుండుటయే యెటువంటి మిక్సర్ గ్రైండర్కైనా చివరి పరీక్ష. జాన్సన్ మిక్సర్ గ్రైండర్ యీ విశిష్ట పరీక్షయందు విజయవంతంగా నెగ్గి, నేడు దక్షిణ ఇండియా యందంతట సాటిలేని పేరు ప్రఖ్యాతులకు చిహ్నంగా అగ్రశ్రేణి నందుకొనియున్నది.

ఇందుకు కారణం:



**భారమైన పనులకు శక్తివంతమైన 450 వాట్ మోటారు** సాధారణమైన బరువుతో పనిచేయవలసినపుడు 45 నిమిషముల కాలం నిలువకుండా సురక్షితంగా పని చేయగలదు—ఇడ్లీలకు వెట్ గ్రైండింగునందు మరియు మసాలాలకు డ్రై గ్రైండింగునందువలనే





**త్వరగా చక్కగా చల్లబడుటకు** సాటిలేని పంకా చల్లని గాలిని లోనికి తీసికొంటూ, వేడి గాలిని పైభాగమునందలి వెంట్ ద్వారా శీఘ్రంగా వెలికి పంపును. మోటారు యెక్కువ కాలం చల్లగా వుంటుంది. మసి మరకలను తగ్గిస్తుంది.



**అధిక వసతికి మరియు అధిక ఆరోగ్యమునకు రెండు జాడీలు:** ఒక పనినుండి మరొక పనికి మారుటకు వసతి కలుగును.



**పలు రకములైన వంట పనులకు వివిధోపకరములైన రెండు బ్లేడ్లు:** కలపడం, రుబ్బడం, దంచడం, పలుచపర్చడం, పోగుచేయడం లేక చిలకడం పనులయందు వలె



**అధిక శుభ్రతకు దిట్టంగా అమర్చబడిన బ్లేడ్లు:** రెండు బ్లేడ్లుకూడా గోపురాకారపు దిమ్మలపై దిట్టంగా బిగింపబడి యున్నవి. వేరు వేరు పనులకు వేరు వేరు బ్లేడ్లు బిగింపవలసిన అవసరం లేదు. వదులుగా బిగింపబడిన బ్లేడ్లు వూడి వచ్చు ప్రమాదాన్ని తొలగిస్తుంది.





**పరిశుభ్రంగా కడుగుటకు వసతిగా సులభంగా విడదీయ వీలైన విడి భాగములు.** మరియు సాటిలేనటువంటి కప్ రూపమందున్న వాషర్ లోనికి ఆహారపు ముక్కలు పోయి అక్కడే నిల్వ వుండి పోనివ్వకుండా చేస్తుంది





**చక్కగా పని చేయుటకు ప్రత్యేకంగా రూపొందింపబడిన బ్లేడ్లు:** రెండు బ్లేడ్లు ఒకే సమయంలో ఒకదాని కొకటి అనుకూలంగాను మరియు పైకి క్రిందికి తిరుగుటకు వసతిగాను యేర్పాటైనందున ప్రతిముక్క పూర్తిగా తిరుగుటకు వీలవును. నిల్వలు వుండవు.



**సులభంగా తిరుగుటకు వసతిగా అందంగా రూపొందింపబడిన అక్రిలిక్ జాడీ:** ప్లాస్టిక్ జాడీయొక్క లోపైపు తగిన విధంగా వంపులు తిరిగి బ్లేడ్ల చలనమునకు అనుకూలంగా వుంటుంది. అందువలన యందలి ద్రవములు ఒకే విధంగా కలిసిపోతాయి.



సులభమైన పట్టునకు చక్కగా రూపొందింపబడిన పిడులు.

తేలికగా వేగమును మార్చుటకు వీలుగా అంచెల గుర్తులు గల ప్రత్యేకమైన స్విచ్చి.

అందమైన నాలుగు—సఫైర్ బ్లూ, ఐస్ గ్రీన్, అల్ట్రా వైట్, మరియు జర్మన్ రెడ్ రంగులలో కోరినది యెన్నుకొను వసతి.

ఒక ఏడాది పూచీ మరియు అమ్మకం తరువాత అవసరమైన మరామతులు వెను వెంటనే చేయబడు వసతి దక్షిణ ఇండియాలో అధిక సంఖ్యలో చిల్లర విక్రయ శాలలు గలవు.

**JOHNSON®** శక్తియందు, పనితనమునందు నిజంగా శ్రేష్ఠమైనది.

Parade/BE/8161

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]




## 5 2 1982 శుక్రవారం మొదలు
## 11 2 1982 గురువారంవరకు

మేషం: ధనాదాయానికి లోటులేదు, అయినా మీది భారీ వ్యాపారమైతే కొన్ని మార్పులు ఇంకా వ్యాపారాభివృద్ధికై చేయవలసియున్నది. ఉద్యోగస్థులకు అనుకూలత ఏర్పడగలదు. ఉత్తమ ఫలప్రాప్తిగలవారం, స్త్రీలకు: సాటివారి పోటీ పెరగటం, ఉద్యోగంలో లభించిన అవకాశాలు జారిపోటం గమనింపనున్నారు.

వృషభం: ఎంతచాకచక్యముంటేనేం? కాలం కానినపు? గ్రహానుకూలత లేనినాడు, వ్యాపారంలో ఏవో పొరపాట్లు చేయనున్నారు. దైనందిన జీవితంలో పొరపాట్లు కూడాదొర్లనున్నవి. స్వల్పంగా ఆదాయం మాత్రం లేకపోలేదు. భూములో, గృహనిర్మాణ స్థలమో, కొనాలనే ప్రయత్నం చేయనున్నారు. స్త్రీలకు అప్రయత్నానుకూలత, ధనలబ్ధి గల వారమే.

మిథునం : ఆరోగ్య భాగ్యం అన్నింటికన్నా శ్రేష్ఠమైనది గదా! అందుచేత శరీర విషయమై జాగ్రత్త వహించటం, వయసు మీరినవారు మరీ జాగ్రత్తపడుట అవసరం. విద్యా సంపాదనలో అభివృద్ధి కనిపించనున్నది. దైవకార్యాచరణం అవశ్యకర్తవ్యంగా భావించండి. స్త్రీలకు: ఉత్తరాల మూలాన అనేక విషయాలు తెలిసికొననున్నారు, ఆదాయంలో అభివృద్ధి కనిపించనున్నది.

కర్కాటకం: ఆశించిన విధంగా ధనాదాయం లేకపోలేదు. ప్రయత్నిస్తే అప్పులు వసూలు కాకపోవటం. ఎవరెంతగా బాధించినా, వేధించినా, ఇతరులకు ధనం ఇవ్వటం ఏమంత శ్రేష్ఠమైన కార్యంకాదు శుభకార్యం నిమిత్తం మీరే అధికంగా వ్యయం చేయవలసిన పరిస్థితులుంటాయి. స్త్రీలకు : సుఖ శాంతులకు, సదవకాశాలకు లోపంలేదు.

సింహం : అనుకోకుండా వ్యయం చేయవలసిన పరిస్థితులుంటాయి. బంధువుల రాకపోకలుంటాయి. అధిక వ్యయం చేయవలసిన పరిస్థితులుంటాయి. నిశ్చయంగా ఉద్యోగ వృత్తులందు, ఆదరణ లభించనున్నది. స్త్రీలకు: నూతనంగా వస్తువుల కొనుటకు, నూతన మార్గంలో ధన సేకరణకు, బంధువుల ప్రీతిని సంపాదించుటకు అనుకూలత సంభవింపనున్నది.

కన్య : ముఖ్య బంధువులతోనో, కుటుంబ సభ్యులతోనో, ముఖ్య విషయాలలో సంప్రదింపులు జరుపనున్నారు. సంభాషణల్లో, చేతల్లో, జాగ్రత్తగా మెలగగలిగితే, మీకే మేలు, గౌరవం, ఆదాయం, అనుకూలం కనిపింప నున్నది. సభా గౌరవమో, పత్రికా గౌరవమో మీకు సంక్రమింపనున్నది. స్త్రీలకు: బంధు ప్రీతికి, ఉద్యోగంలో పెంపుకు, ఆరోగ్య భాగ్యానికి లోటులేదు.

తుల : రాశిలో స్థితుడైన 'గురుగ్రహం' ఆరోగ్య భంగానికి, మరీ వయసు మీరినవారి ఆరోగ్య భంగానికి, దీర్ఘ రోగులకు ఇంకా చెప్పరాని కష్టాలకు గురిచేయుటానికి, ఉద్యోగంలో ఇబ్బందులు కలుగ జేయుటకు, వృత్తిలో ప్రగతి నిరోధించుటకు కారణం. స్త్రీలకు అన్ని రంగాలలో అన్ని విధాలా ఇబ్బందులుంటాయి.

వృశ్చికం : గ్రహించండి, వృత్తిలో మీకు పెంపు లేదు. ఇనుప వ్యాపారస్థులకు అనుకూలత, భారీ వ్యాపారంచేసేవారికి మేలు, విందు వినోదాలలో పాల్గొనే అవకాశం, మాతృ వర్గీయులతో పీడ ఏర్పడగల అవకాశాలున్నాయి. ఆదాయాభివృద్ధి కనిపిస్తుంది. అధికవ్యయం కూడా సంభవమే స్త్రీలకు: కళా రంగంలో, క్రీడా రంగంలో రాజకీయ రంగాన అభివృద్ధి చేకూరనున్నది.

ధనుస్సు : ప్రతిభ రాణించగలదు. నూతనావకాశాలు లభించే మార్గమున్నది. శత్రుజయమున్నది. బంధువుల మూలంగా, మిత్రుల మూలంగా మేలు చేకూరనున్నది. ఆదాయం లేకపోలేదుగాని వ్యయం కూడా అధికమే ఒకానొక విషయంలో బంధుమూలక ప్రయోజనం కలుగనున్నది. స్త్రీలకు : సుఖం, ఆరోగ్యం, ఆదాయం, వృత్తిలో ప్రగతి ఏర్పడగలవారం.

మకరం : అన్నిపనులు సుకరంగా నెరవేరనున్నాయి. అనేక నూతన విషయాలు తెలిసికోగలరు. నూతన మిత్రులు చేరనున్నారు. క్రీడా రంగంలో నూతనావకాశాలుండగలవు. ఉద్యోగంలో ప్రమోషన్ లభించే కాలం చాలవుంది కని గ్రహించాలి. స్త్రీలకు: ఆదాయాభివృద్ధి, కళారంగానుకూలత గల వారం.

కుంభం : మీ తాలూకు వస్తువులు జాగ్రత్తగా ఉంచుకోవాలి. మీ చిత్రరంగ వ్యాపారంలో నూతనంగా అవకాశాలు లభింపగలవు. భూవసతి, పంటవసతి, ఏర్పడనున్నది. గృహ వసతిలేనివారు, ఏవో నూతన ప్రయత్నాలు చేపట్టగలరు. స్త్రీలకు: నూతనంగా ధన సంపాదనా మార్గాలు, వృత్తిలో అనుకూలత ఏర్పడగలదు.

మీనం: మీకు వ్యాపారానుకూలత, ఏదైనా వ్యవహారముంటే పరిష్కారం, ఉద్యోగమందు తే 'ప్రమోషన్' లభించే అవకాశం, బంధువర్గీయుల మూలాన ఆదాయంలో అభివృద్ధి ఏర్పడగల వారం. క్రీడా రంగంలో విశేషాదరం కొంతవరకు లభించగలదు. స్త్రీలకు: భూవసతి ఏర్పడటం, విద్యారంగంలో అభివృద్ధి, రాజకీయ రంగమయితే కొంత అనుకూలం చేకూరగలదు.

—విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి



# వికసిత వదనం



వానపల్లి వెంకటరమణ

వొక్కొక్కప్పుడు ఉద్యోగ నిర్వహణ 'కత్తిమీద సాము' చెయ్యడంలా ఉంటుంది. కాని మాష్టారు పని దాన్ని మించిపోయింది.

అందుకు నిదర్శనం నా కాలేజీ మాష్టారు జీవితం.

అరవై నిముషాలు స్థిమితంగా కూర్చుని పాఠాలు వినే ఓపిక విద్యార్థులలో నశించి పోయి చాలా కాలమైంది అందునా తెలుగు పాఠమంటే మరీ బోరు కొడుతుందేమో!

క్లాస్ రూమ్‌లో మిమిక్రీ ప్రాక్టీస్ చెయ్యడం మొదలు పెడుతున్నారు.

పిల్లికూతలు ... కుక్క అరుపులు ... నక్కల ఊళలు... డప్పుల చప్పుళ్లు ...

రకరకాల వ్యాఖ్యానాలు చేస్తూ పాఠాన్ని సాగనివ్వరు.

మిమిక్రీ కళను ప్రదర్శించుకోవాలని ఉబలాటంగా ఉంటే స్టేజీలు చాలా ఉన్నాయి. కాని అందుకు విరుద్ధంగా క్లాస్‌రూమ్‌లనే స్టేజ్‌గా మారుస్తున్నందుకు బాధ పడవలసి వస్తోంది.

నిజం చెప్పాలంటే నాకు వేమగా పాఠాలను నవ్యరీతులలో చెప్పాలని, రసవత్తరంగా సాగాలని ప్రయత్నిస్తూంటాను. నాకున్న కొద్దిపాటి రచనల్ని చేసే అనుభవంతో పాఠాలలోని సంఘటనలకు నాకు తెలిసిన కొందరి జీవితాలలో జరిగిన కొన్ని ఘటనలను కథల్లా చెబుతూ, వాళ్ళ ఆసక్తి కలిగిస్తూ క్లాసుల్ని సైలెంట్‌గా ఉంచగల్గుతున్నాను.

లంచ్ బెల్ రింగవటంతో బియ్యే ఫైనల్ వాళ్ళకు లెసన్ పూర్తి చేసి పుస్తకాలు తీసుకుని లెక్చరర్స్ వెయిటింగ్ హాల్ చేరుకున్నాను.

టిఫెన్ బాక్స్ విప్పి చూశాను. కమ్మని పూరీలు నోరూరించాయి ముక్క త్రుంచి నోట్లో పెట్టుకోబోయాను.

"మాష్టారూ-" పిలిచారెవరో. తలెత్తి చూశాను. ఎదురుగా కృష్ణమూర్తి నిలబడి ఉన్నాడు. 'ఏమిట'న్నట్లు చూశాను...

"మధ్యాహ్నం క్లాసులు మాకు కాన్సిల్ అయ్యాయి సార్. ఇంగ్లీషు లెక్చరర్‌గారు రాలేదు. మాకేమో తెలుగు కోర్సు చాలా పెండింగ్‌లో ఉంది. మిమ్మల్ని క్లాసు తీసుకోమని అడగటానికొచ్చాను మాష్టారూ!" అన్నాడతను.

కృష్ణమూర్తి బి. ఏ సెకండియర్ క్లాస్ రిప్రజెంటేటివ్.

నా టైంటేబుల్ చూసుకున్నాను. 'టూ టు త్రీ అవర్' నాకు క్లాసులేదు. లాస్ట్ పీరియడ్ మాత్రం 'బీకాం' వాళ్ళకి క్లాసుంది.

"సరే-వస్తాను" చెప్పి పంపించాను.

టిఫెన్ పూర్తి చేసి రిలాక్స్‌గా కుర్చీలో జేరబడ్డాను

కృష్ణమూర్తి గుర్తుకొచ్చాడు అతను తెలివైన స్టూడెంటని చెప్పేవాడో అనుకున్నాను. ఏడాది నుండి మూర్తి నాకు బాగా తెలుసు. దగ్గరయ్యాడు కూడా నా కంటే చిన్నవాళ్ళతో స్నేహం చెయ్యడంవల్ల నాకేమీ ప్రయోజనం లేదని తెలిసినా, పెద్దవాళ్లతో పరిచయం జ్ఞానాభివృద్ధికి మూలమనే స్నేహాభిలాష అతని కుండటం గుర్తించి మూర్తిని దగ్గరకు రానిచ్చాను అతనికి తెలియని విషయాలెన్నిటినో తెలిసేలా చెప్పాను. మూర్తిని చూస్తూంటే ఆత్మీయుడన్న భావం నా గుండెల్లో పొడచూపు తూంటుంది.

ఆలోచనాగింది. టైమ్ చూసుకున్నాను. రెండుకి మూడు నిమిషాలుంది. పుస్తకాలు తీసుకుని క్లాస్ ఛేంజ్ చేసేందుకు లేచాను.

కృష్ణమూర్తి క్లాస్‌రూమ్ ముందు నిలబడి ఎదురు చూస్తున్నాడు. చిన్నగ నవ్వాను.

# వికసిత వదనం

"రండి మాష్టారూ!" అంటూ లోనికి నడిచాడు క్లాసులో అడుగు పెట్టాను. అంతా లేచి నిలబడ్డారు.

"ప్లీజ్ సిడౌన్" చెప్పి క్లాసుని చూశాను స్టూడెంట్స్ తక్కువగా ఉన్నారు సొతిక మంది కూడా ఉండరేమో!

"క్లాస్ స్ట్రెంగ్త్ ఇంతేనా?" అడిగాను

"క్లాసుందని తెలియక కొంతమంది వెళ్లి పోయారు సార్" మూర్తి చెప్పాడు చిన్నగా నిట్టూర్చాను క్లాసుందని తెలియక కాదు మాతృభాషమీద శ్రద్ధలేక 'చిన్న చూపు చూసేవాళ్లే వెళ్లి పోతారు మనస్సు చివుక్కుమంది వచ్చేకున్నాక తప్పదు గనుక లెసన్ చెప్పేందుకు పుస్తకం తీశాను

పాఠం చదవుతూ, లెక్చరిస్తున్నాను. వింటున్న వాళ్లను చూస్తూ చెప్పుకుపోతు న్నాను. కొంతమంది విసుగు ప్రదర్శించడం గమనించి ఆపేశాను మూర్తి నేదో అడగాలని అతనివైపు చూశాను ఎందుకో నాకు గోపీ నాథ్ గుర్తుకొచ్చాడు మనసంతా మూగ వేదనతో నిండి పోయింది

"డియర్ స్టూడెంట్స్! పాఠంలో వచ్చిన సందర్భాన్ననుసరించి మన సామాజికవ్యవస్థలో జరిగిన ఒక ఉదంతాన్ని కథగా చెప్పాలను కుంటున్నాను" మార్దవంగా అన్నాను

"చెప్పండి మాష్టారూ!" ఉత్సాహంగా వాళ్లంతా అన్నారు

చెప్పడాని ఉపక్రమించాను

*　　*　　*

తెల్లవారుతోంది -

రాత్రి నుండి ఎడతెరిపి లేకుండా వర్షం పడుతూనే ఉంది గాలి రివ్వున వీస్తూనే ఉంది

ఆ ఇంట్లో నిశ్శబ్దాన్ని చీలుస్తూ విపరీత మైన మూలుగులు, 'అమ్మా ... అబ్బా ... ఉష్' అంటూ భరించరాని నొప్పి ననుభ విస్తున్నట్లుగా మాటలు వినబడుతున్నాయి.

వరండాలో గోపీనాథ్ కాలుగాలిన పిల్లిలా అటు, ఇటు పచార్లు చేస్తున్నాడు భార్య మూలుగు వినబడితే చాలు కంగారుపడు తున్నాడు ఆడపిల్లలిద్దరూ బిక్కుబిక్కు మంటూ వరండాలో కూర్చున్నారు.

శాంతమ్మ మంచమ్మీద నొప్పులు భరించ లేక మెలికలు తిరిగి పోతోంది. రాజ్యలక్ష్మమ్మ

కోడలి అవస్థను చూస్తూ భరించలేక పోయింది తలుపులు తెరిచి వరండాలో కొచ్చింది.

"అబ్బాయ్ శాంతకు ఈ కాన్పు కష్టమయ్యేలా ఉంది. డాకరమ్మ చెప్పనే చెప్పింది— ఈసారికి కొంచెం కష్టమేనవి అన్నట్టిలో చేర్పిస్తే మంచిదిరా!" సలహాగా చెప్పింది. గోపీనాథ్ తల్లి చెప్పిన మాటలు విన్నాడు. ఆలోచించసాగాడు

హాస్పిటలంటే మాటలు కాదు. మందుకీ, మాకుకీ డబ్బు కావాలి ఖర్చులెక్కువ. ఎలా? తన దగ్గర డబ్బు అప్పుగా తీసుకుని తిరిగి ఇవ్వని వాళ్ళు చాలామంది ఉన్నారు అడగాలే గాని ఎవరైనా ఇవ్వకపోతారా? ధీమా ఏర్పడింది. వెంటనే శాంతమ్మను నర్సింగ్ హోమ్‌లో చేర్పించాడు మిగిలిఉన్న జీతం డబ్బులు అడ్మిట్ ఫీజు, మందులకీ ఖర్చు పెట్టాడు

రోజంతా నొప్పులతో శాంతమ్మ బాధ పడుతూనేఉంది గోపీ కంటిమీద కునుకు లేకుండా జాగారంచేశాడు తెల్లవారుతూనే శాంతమ్మకు నొప్పులు ఎక్కువయ్యాయి డాకరమ్మ హడావుడి చేసింది. ఆపరేషన్ చెయ్యవలసి ఉంటుందని, ఇంకా ఏదేదో కంగారుగా చెప్పి థియేటర్‌కి శాంతమ్మను స్ట్రెచర్ మీద తీసుకెళ్ళారు గోపీ ప్రాణాలర చేతిలో పెట్టుకుని రూమ్ బయట తచ్చాడుతున్నాడు. నిముషాలు భారంగా దొర్లుతున్నాయి డాక్టరమ్మ బయటకొచ్చింది.

"మిష్టర్ గోపీనాథ్. ఆపరేషన్ బాగానే జరిగింది. మీకు నెంబర్ త్రీ అనుకుంటాను. మాష్టర్ గోపి పుట్టాడు కంగ్రాట్స్" చెప్పిందావిడ

'థాంక్యూ డాక్టర్" గోపీ ఆనందానికి హద్దుల్లేవు. అబ్బాయి పుట్టినందుకు ఉబ్బి తబ్బిబ్బయ్యాడు

"కాని..." డాక్టరేదో చెప్పబోయింది. కీడు శంకించిన అతని గుండె తీవ్రంగా కొట్టుకుంది. కళ్ళలో ఆందోళన వ్యక్తం కాసాగింది.

"కా నీ ... డా క్ట ర్! చె ప్పం డి. ఏంజరిగింది?" ఆత్రుతగా అడిగాడు.

"కంగారు పడకండి గోపీనాథ్ బ్లడ్ తక్కువగా ఉన్నందువల్ల తల్లి బలహీనంగా ఉంది. ప్రాణాల కపాయం అనే సంగతి ప్రస్తుతం చెప్పలేను. కాని బ్లడ్ ఎక్కించాలి ఆవిడకు కావలసిన గ్రూప్ మా బ్లడ్ బాంక్‌లో లేదు. నేను చెప్పినచోట మీరువెళ్ళి వెంటనే బ్లడ్ బోటిల్ తీసుకురండి. అక్కడి డాక్టర్‌కి చీటీ వ్రాసిస్తాను" డాక్టరేదో రాసిచ్చింది.

గోపీ కంగారుగా డాక్టర్ని చూసాడు. ఏదో చెప్పాలనుకున్నాడు. ఆమె వెళ్ళిపోయింది. చేసేదిలేక ఆలోచిస్తూ బయల్దేరాడు. బోటిల్ కొనాలంటే కనీసం రెండొందలైనా కావాలి అంతడబ్బు ఎక్కడ సంపాదించాలో తెలియక దిక్కుతోచని వైపు నడిచాడు.

తన దగ్గర అప్పుతీసుకున్న వాళ్ళంతా గుర్తొచ్చారు రామారావొక్కడే అయిదొందలివ్వాలి అతనైతే సర్దగలడనిపించింది. రామారావింటివైపు నడిచాడు ఆగిన వర్షం మొదలైంది. గాలి విసురుగా వీస్తోంది. తుఫానులా ఉందనుకున్నాడు గొడుగువిప్పాడు.

గమ్యం చేరుకున్నాడు. తలుపు తట్టాడు. నడివయస్కురాలు తెరిచింది.

"రామారావు లేడామ్మా?" అడిగాడు.

"జ్వరంతో పడుకున్నారు!" చెప్పిందామె. లోపలికెళ్ళాడు రామారావు దగ్గుతూలేచాడు. గోపీ తన యిబ్బంది చెప్పి డబ్బు సర్దమని అడిగాడు.

"సారీ గురూ! ఇప్పుడు నాకు కూడా డబ్బు చాలా అవసరంగా ఉంది ఎవర్నడగాలో తెలీక తిలమక పడుతున్నాను. నీ కివ్వవలసిన బాకీ గుర్తుంది తొందరలో తీర్చేస్తాను" నీరసంగా చెప్పాడు అతడ్ని బాధించి ప్రయోజనం లేదనుకుని గోపీ అక్కడ్నుండి బయలుదేరాడు తనకు బాకీపడ్డ మరొకతన్ని అడిగాడు— 'ప్రస్తుతం నాదగ్గర చిల్లిగవ్వ లేద'ని తప్పించుకున్నాడతను

గోపీ నడుస్తున్నాడు నడవలేక నడుస్తున్నంత కష్టంగా కాళ్ళీడుస్తున్నాడు. ఈదురు గాలి, వర్షపుజోరూ ఏ మాత్రం తగ్గలేదు. గొడుగును పట్టుకున్న చేతి నరాలు లాగుతున్నట్టుగా ఉందొక వైపు మరోవైపు భార్య గురించి కంగారు. కానీ ఆశ అతడ్ని నడిపిస్తోంది.

మూర్నాళ్ళి కలిశాడు. రెండొందలు బాకీ వున్న అతను కూడా 'నెలాఖరు రోజులు. జేబులు ఖాళీగా ఉన్నాయి. త్వరలో ఇస్తాను. ఏమనుకోకు బ్రదర్' అని చెప్పి తప్పించుకున్నాడు ఎటూ తోచని పరిస్థితులలో చిక్కుకున్నాడు గోపి ఎవర్నడగాలో తెలియక నడక సాగించాడు గాలి, వర్షానికి ఎదురీదుతున్నాడు ఆయాసంతో అడుగులు బరువుగా పడుతున్నాయి దగ్గు తెరలు తెరలుగా వస్తోంది నొప్పిగా ఉండటంతో గుండెలమీద అరచేతితో రాసుకున్నాడు. దగ్గు తగ్గలేదు. ఇంకా ఎక్కువైపోయింది వాంతిచేసుకున్నాడు. నోటి నుండి ఏదో పడింది పెదవుల్ని తుడిచిన చేతి వ్రేళను చూసుకున్నాడు. ఎర్రని రక్తం చేతి వ్రేళకి అంటి వుంది. బాధగా నొక్కుని, గుడ్డతో తుడిచి ముందుకు నడిచాడు

గోపీకి లెక్చరర్ మిత్రుడు జ్ఞాపకం వచ్చాడు ఆశ చిగురించింది. లేని శక్తిని తెచ్చుకుని వడివడిగా అతనింటికి చేరుకున్నాడు జగన్నాథరావు ఆప్యాయంగా లోపలికి తీసుకెళ్ళాడు. గోపీ ఆత్రుతగా విషయం



చెప్పాడు. ఇద్దరూ కొంత సేపు ఏదో మాటాడుకున్నారు. జగన్నాధరావు డబ్బిచ్చి గోపీనాధ్‌ని పంపించాడు.

శాంతమ్మ కోలుకున్నాక "ఏమండీ..." పిలిచింది.

గోపీ దగ్గరగా వెళ్ళాడు. శాంతమ్మ ప్రక్కలో చూసుకుంది. గమనిస్తున్న గోపీ కలవరపడ్డాడు. ఆమె కళ్ళలో కనబడుతున్న ప్రశ్న చదివగలిగాడు.

"శాంతా నీకు చాలా సుస్తీ చేసింది. ఆపరేషన్ చేసారు. రక్తం కూడా ఎక్కించారు. నువ్వు బతికావు. కాని... కాని... మనకు బిడ్డ దక్కలేదు" అనగలిగాడు.

బిడ్డలిద్దర్నీ దగ్గరకు తీసుకుని శాంతమ్మ గుండెలవిసేలా కుమిలిపోయింది. గోపీ ఆమె బాధను చూడలేక తల దించుకున్నాడు.

* * *

"మాష్టారూ! నాకో సందేహం వచ్చింది. అడగమంటారా?" కృష్ణమూర్తి అన్నాడు.

"ఏమిటది?" అడిగాను.

"లోకంలో ఎవరైనా డబ్బు అప్పుగా అడగటానికి సిగ్గుపడతారు. అప్పు చెయ్యవలసి వచ్చిందే అని బాధపడతారు. కాని మీరు చెబుతున్న కథలో గోపీనాధ్ ఎందరికో అప్పుగా ఇచ్చిన డబ్బును వసూలు చేసుకోలేక ఇబ్బంది పడటమెందుకు?"

"మంచి ప్రశ్నే వేశావు. సరే ... విను. ఎదుటివాడు డబ్బుకి కటకటలాడుతూంటే, అప్పుగా డబ్బు సర్దమని ప్రాధేయపడుతూంటే, వాళ్ళ ఇబ్బందుల్ని తల్చుకుని కాదనలేకపోయే గోపీలాంటి వాళ్ళు అరుదుగా ఉన్నారీలోకంలో. అంతేకాకుండా గోపీ విషయంలో అతనికి తిరిగి వసూలు చేసుకునే మనస్తత్వం లేకపోయింది. 'వాళ్ళే ఇస్తారు' లెమ్మని ఉదాసీనంగా ఉండేవాడు. దానితో సంసారం గడవటం కష్టమైపోయింది. ఎన్నో ఇబ్బందులతో గోపీ చితికిపోయాడు" చెప్పడం ఆపాను.

"మరో సందేహం సార్! గోపీనాధ్‌కి అబ్బాయి పుట్టిన సంగతి డాక్టర్ చెప్పిందని మీరు కథలో చెప్పారు. కాని శాంతమ్మకు ఆపరేషనయ్యాక ఆమె కోలుకున్న తర్వాత 'బిడ్డ దక్కలేదని' గోపీ చెప్పాడన్నారు. అంటే అతనా బిడ్డను జగన్నాధరావుకి అమ్మివేశాడంటారా?"

"ఆ ప్రశ్నకు జవాబిచ్చేకంటే, నేనొక టడుగుతాను. చెప్పు? కొన్ని కొన్ని పరిస్థితులలో నువ్వైనా, నేనైనా, మరొకరైనా మృత్యువాత పడబోతున్నవారిని రక్షించాలని చూస్తారా? లేక నిర్లక్ష్యంగా వదిలేస్తారా?" సూటిగా అడిగాను

"మీ మాట ప్రకారం భార్యేకాకపోయినా, మరో వ్యక్తైనా మానవత్వం ఏమాత్రమైనా ఉంటే మృత్యువు నుండి రక్షించాలనే ప్రయత్నిస్తారెవరైనా!"

"గుడ్. గోపీ ఆ సంక్లిష్ట పరిస్థితులలో మిత్రుని కోరికమీద పుట్టిన బిడ్డను పెంపకానికిచ్చేశాడని అనుకోవచ్చు కదా! అమ్మివేశాడని ఎందుకనుకోవాలి?" మూర్తి మౌనంగా కూర్చుండి పోయాడు.

"మిగతా కథ పూర్తిచెయ్యమంటారా?" అడిగాను వాళ్ళేమైనా బోర్ ఫీలవుతున్నారేమోనని అనుమానంతో.

"ఆసక్తిగా ఉంది చెప్పండిమాష్టారూ!" అంతా వంత పలికారు

చెప్పడానికుపక్రమించాను —

* * *

రాజ్యలక్ష్మమ్మ వ్రాసిన లెటరు చదివిన రామమూర్తి కంగారుపడ్డాడు. వెంటనే లీవ్ పెట్టి హైదరాబాద్ చేరుకున్నాడు. రామ్మూర్తిని చూడగానే ఆవిడ కన్నీళ్ళు పెట్టుకుంది.

"అన్నయ్యేడి?" రామ్మూర్తి అడిగాడు.

"రామం! వాడికేదో అవుతూందిరా. ఎప్పుడు చూసినా ఏదో సంధి వాగుడు. దగ్గు వాడ్ని తినేస్తోంది మాకు భయంగా ఉంది. నువ్వే వాడ్ని కాపాడతావని, మామ్మూలు మనిషిని చేస్తావని గంపెడాశతో ఉత్తరం వ్రాసాను"

"భయంలేదు పెద్దమ్మా! నేను చూసుకుంటాను కాని దూరంగా ఉన్నాననేగా నాకేవిషయాలు తెలియనివ్వలేదు" రామం గద్గదస్వరంతో అన్నాడు.

"లేదు బాబూ! ఆ ఉద్దేశ్యం మాకేమీ లేదు. నిన్ను కూడా ఇబ్బంది పెట్టడం ఇష్టంలేక వ్రాయలేదు. అయినా తప్పలేదు చూశావా? దైవ నిర్ణయం ప్రకారం నువ్వు వచ్చావు. మాకు కొండంత ధైర్యం ఇస్తున్నావు. అంతేచాలు."

గోపీ దగ్గుతూ లోపలికొచ్చాడు. రామ్మూర్తిని చూశాడు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

# వికసిత వదనం

"ఎప్పుడొచ్చావురా రాముం! బాగున్నావా?" అడిగాడు

"ఆ... బాగానే ఉన్నాను మరేమిటన్నయ్యా ఇలా తయారయ్యావు?" చిక్కి శల్యంగా కనబడుతున్న గోపీ నడిగాడు.

"నాకు నేనుగా తయారవలేదు పరిస్థితులకు బందీనై పోయాను అవే నా అంతు చూస్తున్నాయి. పండుటాకులా మార్చివేశాయి రాల్చి వేయడానికే ప్రయత్నిస్తున్నాయి" అంటూ శుష్కంగా నవ్వాడు.

"వేదాంతం చెప్పకన్నయ్యా.. నాక హ్యాం. పెద్దమ్మ అంతా చెప్పింది నిన్ను కాపాడుకోవడానికే నేను వచ్చాను" అన్నాడు ధైర్యమిస్తూ.

"అహ హ్హా హ్హా... నన్ను కాపాడుకోడానికి వచ్చావా? ఒరే రాముం ఎండిపోయిన చెట్టు కాలక్రమంలో మరల చిగురిస్తుందేమోగాని— పండిపోయిన ఆకు రాలిపోవాల్సిందే. అది ధర్మం. ప్రకృతి నిబంధన. అంతే. నన్ను కాపాడటం నీతరం కాదు."

"ఎందుకన్నయ్యా! అంతంత పెద్ద మాటలు? ఇప్పుడు నీకేం వయసు మించుకు పోయిందని పేలవంగా మాటాడుతున్నావు? నిండు జీవితంలో అర్ధగీత దాటని వాడివి. కష్టాలు నిన్ను క్రుంగదీసినంత మాత్రాన అర్థాంతరంగా నీ జీవితం ముగిసిపోవాల్సిందేనా?"

"పిచ్చివాడా! చావును కోరుతూ జబ్బు నా వంట్లో ప్రవేశించాక బలవంతంగా ఆపినా ఆగదీ ప్రాణం నీకు తెలుసో? తెలీదో? క్షయ నన్ను అణువణువునా తినేసిందిరా. దానికంటే ముందు మనస్తాపం నా గుండెల్ని కాల్చేసింది అందుకే ఈ తనువు రాలిపోవాలి. అంతే"

"అలా ఎన్నటికీ జరగదు నిన్ను బ్రతికించుకుంటాను" రామ్మూర్తి దృఢంగా అన్నాడు గోపి పకపకా నవ్వసాగాడు నవ్వులోనే దగ్గు ఉద్ధృతంగా వచ్చేసింది. వాంతిచేసు

కున్నాడు నోటి నుండి రక్తం ముద్దగా పడింది అంతా కంగారు పడ్డారు

జనరల్ హాస్పిటల్‌లో గోపీని ట్రీట్‌మెంట్ కోసం రామ్మూర్తి జేర్పించాడు పెదనాన్న విరిచినడాక్టర్‌ని గోపీని బతికించమని ప్రాధేయపడ్డాడు డాక్టర్లు శ్రమ పడ్డారు. లాభంలేక పోయింది ఆ సాయంత్రమే గోపీని మృత్యువు తన్నుకుపోయింది.

రామ్మూర్తిని ఆఖరిసారిగా చూసిన గోపీ కళ్లు 'నేను చెప్పానా? ఈ తనువు రాలి పోతుంద'ని అన్నట్టుగా వున్నాయి. రాజ్యలక్ష్మమ్మ రామ్మూర్తి, శాంతమ్మ కుమిలి పోయారు

*       *       *

బెల్ మోగడంతో చెబుతున్న కథఆపి వేసి, పుస్తకాలు తీసుకుని క్లాస్ వదిలి వచ్చేసాను బయటకు వెళుతూ కృష్ణమూర్తి వైపు చూశాను. అతని కనుకొనల్లో నీటి బిందువులు నిలిచి ఉన్నాయి. బాధపడ్డాను.

నా మనసేం బాగుండకపోవడంతో లాస్ట్ పీరియడ్ కేన్సిల్ చేసుకుని, ఇంటికి వచ్చేసాను. వదిన అందించిన టీ తీసుకున్నాను పడక కుర్చీ బయట వేసుకుని రిలాక్స్ అయ్యాను.

దగ్గరకు వేసిన ఇనుపగేటు తీస్తూ కృష్ణమూర్తి కనబడేసరికి నేనూహించినదే నిజమైంది. మూర్తి వస్తాడని నేను ముందుగానే అనుకున్నదే !

"రావోయ్ మూర్తీ !" పిలిచాను. నా దగ్గరగా వచ్చాడు. మోడా చూపించాను. కూర్చున్నాడు

"ఏమిటిలా వచ్చావు ?" అడిగాను

"కథ పూర్తిగా వినేందుకొచ్చాను మాష్టారూ ! తర్వాతేం జరిగిందో చెబుతారా ?" అతడి మాటల్లో కుతూహలం కనబడింది. నవ్వాను ఆత్మీయంగా.

"చెప్పేందుకేముంది మూర్తీ ! గోపీ పోయాక వాళ్ళ కుటుంబాన్నంతా రామ్మూర్తి తనతోపాటు తీసుకొచ్చేసాడు. ఆడపిల్లల్ని చదివించి, పెద్దవాళ్ళయ్యాక పెళ్ళిళ్లు చేసి పంపించాడు"

"రామ్మూర్తిగారు పెళ్లి చేసుకోలేదా?" అడిగాడు మూర్తి.

"జరిగిన సంఘటనతో రామ్మూర్తి మనసు వికలమైపోయింది అన్నగారి కుటుంబాన్ని ఒక దారికి తీసుకురావడానికి ఆధారంగా నిలబడ్డాడు గనుక బాధ్యతకే అంకితమైపోయాడు అందుకే పెళ్ళంటే అనవసరంగా భావించుకున్నాడు పెళ్లి విషయం వదిలేశాడు"

"ఎంత విషాదం మాష్టారూ ! నేనొక టడుగుతాను, నిజం చెప్తారు కదూ ! ఈ కథలో అన్నగారి కుటుంబం కోసం త్యాగమూర్తిగా మారిన రామ్మూర్తి మీరేకదూ ? మీ వాదన ప్రకారం జగన్నాధరావుగారికి పెంపకానికి వెళ్ళిపోయిన డబ్బుకి అమ్మేయబడిన గోపీ కొడుకుని నేనేకదూ ?" గద్గదస్వరంతో అడిగాడు

"మూర్తీ !" ఆశ్చర్యపోయాను

"నాకు తెలుసు మాష్టారూ ! జగన్నాధరావుగారు వ్రాసుకున్న డైరీలో ఈ విషయమంతా ఉంది అతను నా కన్నతండ్రి కాదని, పెంచిన తండ్రని నాకప్పుడే తెలిసినా - మీరీ రోజు కథగా చెప్పేనంతవరకూ నా తల్లిదండ్రులెక్కడున్నారో తెలియలేదు అమ్మల్ని ఆ విషయమే అడగాలని వచ్చాను చెప్పండి మాష్టారూ ! నేనడిగింది నిజమే కదూ ?"

"నిజమే గోపీ రాసుకున్న డైరీ నాకు జగన్నాధరావుతో పరిచయం ఏర్పడేలా చేసింది. డైరీ చూపించి అతన్నడిగాను నిన్ను చూపించాడు గోపీ కొడుకు నువ్వేనని తెలిసిన ఆ క్షణాల్లో నా సంతోషానికి అవధులే కపోయాయి. నిన్ను వెంటనే ఇక్కడకు తీసుకొచెయ్యాలనిపించింది కాని నువ్వు నమ్ముతావో ? లేదోనని భయంతో ఆగాను ఈ రోజెందుకో నిన్ను చూడగానే నా మనసు కలుక్కుమంది అందుకే గతమంతా కథలా చెప్పాను నీకు కూడా ఈ విషయం తెలిసుంటే తప్పక నువ్వు ఇక్కడికొస్తావని అనుకున్నాను. నా వూహ నిజమైంది."

"బాబాయ్..." మూర్తి వంగి నా కాళకు నమస్కరించాడు.

మూర్తిని లేవనెత్తి అక్కున చేర్చుకున్నాను ఆనందంతో నా కళ్లు చెమర్చాయి. భుజంమీద పడుతున్న నీటి బిందువులకు ఉలిక్కిపడి అతడ్ని అనుసరించాను

"అమ్మను చూడాలనుంది బాబాయ్" కోరిక కాదది- ఆత్రుత

"తప్పకుండా !" ఊరడించాను. వదిన్ని పిలిచాను గోపీ రాసిన డైరీలో చివరిపేజీ పైకి చదివాను-

14 సెప్టెంబరు 1960

నా భార్య ప్రసవించింది చిరకాల వాంఛ మగబిడ్డ కావాలని. నాకు అందమైన బిడ్డనే ప్రసాదించింది కాని ... ఎక్కడో అపశృతి వినబడుతోంది ఆమె ప్రాణాలకే ముప్పు ముంచుకు రావడంతో బ్లడ్ ఎక్కించాలని చెప్పింది డాక్టర్. బ్లడ్ బాటిల్ కొనాలి డబ్బు అవసరం నన్ను వేధించసాగింది నా కివ్వవలసిన ఎందరో మొండి చెయ్యి చూపించారు ఆపద సమయంలో ఆదుకున్నందుకు నా అవసరాన్ని గుర్తించలేకపోయారు. ఎవరినని ఏంలాభం ? ఈ పరిస్థితులలో నేనేం చెయ్యాలి ?

దగ్గు విపరీతంగా ఉంది. నోటి నుండి రక్తం కూడా పడుతోంది. గుండెల్లో ఒకటేమంట. భరించలేని నొప్పి నాకు క్షయ ఉందేమోనని ఆలోచించాను నా చివరి క్షణాలు స్పష్టంగా కనబడసాగాయి నాకు పుట్టిన బిడ్డని ముఖంగా దర్జాగా పెంచ



## వికసిత వదనం

లేదని నాకు తోచసాగింది. జగన్నాథరావు లెక్చరర్ ఆప్తమిత్రుడు. పిల్లలు లేని ఆ దంపతులైతే నా కొడుకుని గొప్పవాణ్ణి చెయ్యగలగనే స్వార్థం నాలో తలెత్తింది. అదీగాక నా ఎదుటగా పెద్ద సమస్య నిలిచింది. సహధర్మచారిణి చావుబతుకుల్లో ఉంది. ఆమెను రక్షించుకోలేకపోతే నేను అల్పుణ్ణయి తీరుతాను. అందుకే నా బాబుని జగన్నాథరావుకి అమ్మివేసిన అభాగ్యుణ్ణి. ఈ నిజం నేను బతికున్నంతకాలం నా గుండెల్ని పిండి చేస్తూనే ఉంటుంది....

చదవటం ఆపేశాను. కృష్ణమూర్తి గురించి వదినతో చెప్పాను. నమ్మలేనట్లు ఆశ్చర్యంగా చూడసాగింది. అతని ముఖంలో తనరూపం కోసం, చనిపోయిన భర్త పోలిక కోసం వెదుకుతోంది. మూర్తి తల్లిని ఆరాధనగా చూస్తున్నాడు.

"అమ్మా!..." కృష్ణమూర్తి తమకంగా పిలిచాడు.

"బాబూ!..." వాత్సల్యంగా ఆమె స్వరం పిలుస్తోంది.

మూర్తిని వదిన ఆప్యాయంగా అక్కున చేర్చుకున్న దృశ్యం నన్ను పులకింపజేసింది.

నిరాశ పేరుకుపోయిన ఆమె వదనంలో ఇన్నాళ్ళకు వికసించిన వెన్నెల కనబడింది. కళ్ళనుండి రాలుతున్న నీటి బిందువుల్లో భవిష్యత్ మీద బంగారపు ఆశ తళుక్కున మెరిసింది.

# మీ వాళ్ల భవిష్యత్తును గాలికి వదిలేస్తారా?

**మీ కుటుంబానికి** చీకూ–చింతాలేని భవిష్యత్తు గురించి **ఆలోచించటం** మీ గృహస్థ బాధ్యతకదా!

**పిల్లల చదువులకు**, పెళ్ళిళ్ళకు, ఇంటికి, మీ దగ్గర **కావల్సినంత** సొమ్ము **ఉంటే** ఎట్టి అవాంతరాలనైనా ఎదుర్కొనే ధైర్యం మీకుంటుంది ఆ ధైర్యాన్నివ్వటానికే **కెనరా బ్యాంకు** సదా మీకు తోడుగా ఉంటుంది

నెల జీతంమీద ఆధారపడే వాళ్ళకు సులభతరంగా ప్రతినెలా నిర్ణీతమైన మొత్తాన్ని దాచుకోటానికి **రికరింగ్ డిపాజిట్** పథకం **కెనరా బ్యాంకులో** ఉంది

మీ పిల్లల చదువుకోసం ఇప్పుడే **విద్యానిధి** పథకంలో చేరండి సొమ్ము మీ పిల్లలతోపాటు పెరుగుతుంది

మీ ఉద్యోగ విరమణ తర్వాత మీకు ప్రతినెలా ఆదాయం కావాలంటే **నిరంతర డిపాజిట్ లో** మీరిప్పుడే చేరటం అవసరం అందువలన మీ పెట్టుబడి ధనం తగ్గకుండా ప్రతినెల మీకు నిర్ణీతమైన ఆదాయం లభిస్తుంది

మీకు అనుకూలించే పథకాలను ఎన్నుకొని మీ అవసరాలకు జాగ్రత్త పడండి ఇంకా **కామధేను, ఫిక్సెడ్, సేవింగ్స్** పథకాలుకూడా మా బ్యాంకులో ఉన్నాయి

నేడే మీకు దగ్గరలో ఉన్న మా బ్రాంచికి రండి అది మీ బంగారు భవిష్యత్తుకే సుమండీ!




# కెనరా బ్యాంక్

(జాతీయ బ్యాంక్)

దేశము మొత్తమున **1,300** కు పైగా శాఖలు కలవు.

## ముఖచిత్రం

రంగవల్లి తీర్చి శృంగార లహరిగా
కనులవిందు చేసెగా "జయప్రద"
ముఖ చిత్ర మద్భుతము. ఆంధ్రపత్రికా
జయము హో ! తెలుగు జాతిమెచ్చె

ఆకెళ్ల సుబ్బారావు (కందికుప్ప)

*　　*　　*

"రంగవల్లికలతో— రంగైనచీరెతో
కాంతులీనెడి ముఖ కవళికలతో
వింత సోయగమును సంతరించుకున్న
అట్ట మీది బొమ్మ హాయిగొలిపె.

జి. విశ్వనాథం (ధనుపురం)

*　　*　　*

15.1.82 తేదీ పత్రిక పై ముద్దుగుమ్మ జయప్రద ముఖచిత్రం ముద్దొస్తుంది. ముగ్గులో ముగ్ధలా మురిపాల మల్లెమొగ్గలా వుంది. ముగ్గు బుట్ట లేక ముగ్గు ఎలా వేశావు ముద్దు గుమ్మా!

యూడికి లావణ్యలత, డి. వాసంతి, ఎ. గాయత్రి (పెండేకల్)

*　　*　　*

తేది. 15.1.82 నాటి "జయప్రద" ముఖ చిత్రం చాలా బాగుంది. ఎన్నాళ్ళనుండియో నేను కుమారి 'జయప్రద'ను ఆ దుస్తులలో ఆ పోజులో చూడాలని మనస్సులో కోరుకుంటున్నాను.

ఎం. వి. నరసింహమూర్తి (వేణమ్మపేట)

*　　*　　*

'ముగ్గులు వేస్తున్న ముద్దుగుమ్మ' జయప్రద ముఖ చిత్రంతో వెలువడిన 15.1.82 నాటి ఆంధ్రపత్రిక అత్యంతఆకర్షణీయంగావుంది. అచ్చ తెనుగు తనం ఉట్టిపడే ఈ ముఖ చిత్ర సుందరి చూడ ముచ్చటగా వుంది.

శ్యాం మోహన్‌రావు (అమలాపురం)




15.1.82 వ తేదీ సంచిక అందాల నటి "జయప్రద" ముఖ చిత్రం చాలా అందంగాను ఆకర్షణీయముగాను ఉంది.

బి. లక్ష్మణశాస్త్రి (భీమవరం)

*　　*　　*

ముగ్గులు వేస్తున్న నటి జయప్రద ముఖ చిత్రముతో 15.1.82 వ తేదీ సంచిక చాలా ముచ్చటగా వుంది.

బండారు జాన్సీలక్ష్మి (మచిలీపట్నం)

## కథలు

జయప్రద ముఖ చిత్రం మమ్మల్ని ఆకర్షించింది. "మళ్ళీ ఎప్పుడో ఎక్కడో" కథ రచయిత శైలి ఎంతో బాగుంది. ముగింపు నచ్చింది.

"అరాచకమా వర్ధిల్లు" కథ మన రాజధానిలో జరిగే సంఘర్షణల వలన సాటి ప్రజలకు ఎన్ని కష్టాలు కల్గుతాయో విశదీకరించారు.

గనిశెట్టి నాగేశ్వరరావు (ఒంగోలు)

*　　*　　*

15.1.82 నాటి పత్రికలోని "మళ్ళీ ఎప్పుడో.. ఎక్కడో" కథ మా ఇంటిల్లిపాదికి నచ్చింది. "ఆకాశహారివిల్లు విరిస్తే" కథ కూడ చాలా బావుంది. పిల్లల స్వభావాలను అర్థం చేసుకోలేని రాధారాణి లాంటి వారు చదివి తీరాల్సిన కథ ఇది.

శేషశాయి (అనంతపురం)

15.1.82 వ తేదీ ఆంధ్రపత్రిక (వారపత్రిక) లో "మళ్ళీ ఎప్పుడో.. ఎక్కడో..? అరాచకమా వర్ధిల్లు" కథలు చాలా బాగున్నవి.

కె. చంద్రశేఖరరెడ్డి, కార్యదర్శి, ఎ. ఎస్. ఆర్. అభిమాన సంఘం (తిరుపతి)

## సీరియల్స్

"జీవితవనంలో కొత్తగాలి" సీరియల్‌లో, కిరణ్ గర్వభంగం చేసికొని, సంధ్య ఆఫీసుకి వచ్చి సెట్ను లాగేసిం. ఇన్ని బొమ్మలో వారల షర్టు వేసికొని ఉన్నాడు కిరణ్. సీరియల్ చాలా ఇంట్రెస్టింగ్‌గా సాగుతోంది.

సంతోష్‌సాహ్ (విశాఖపట్నం)

*　　*　　*

ఈ వారం జయప్రద ముఖచిత్రం చూస్తున్న కొద్దీ ఇంకా చూడలనిపించేంత ముచ్చటగా వుందండీ. సీరియల్ జీవితవనంలో కొత్తగాలి ప్రతివారం సస్పెన్స్‌తో సాగి మళ్లీ వచ్చే వారం కోసం ఎదురు చూసేలా చేస్తోంది. సంధ్య కిరణ్ పాత్రలు పాఠకుల హృదయాలలో చెరగని ముద్ర వేస్తాయనటంలో సందేహంలేదు. ఈ నవల సినిమాతీస్తే చాలా బాగుంటుంది.

మోటమర్రి బేబీకళ్యాణి (బెండమూర్లంక)

## కార్టూన్లు

15-1-82 నాటి పత్రికలో వేసిన కార్టూన్లు చాలాబాగున్నాయి. ముఖ చిత్రాల విషయంలో అన్ని పత్రికలకంటే అందెవేసిన చెయ్యి అని చెప్పవచ్చును. మళ్లీ ఎప్పుడో, ఎక్కడో కథబాగుంది.

పి. సూరిబాబు [దాచేపల్లి]

## వ్యాసాలు

1—1—82 పత్రికలోని "క్రిస్మస్ గాథలు" బాగున్నది. క్రీస్తు పుట్టుకకు ఇంకా ప్రాముఖ్యత ఇచ్చివుంటే బాగుండేది. ప్రచురించినందుకు కృతజ్ఞతలు. కథ బాగున్నది.

బాంగ్ జాన్ విక్టర్, అల్‌కోబర్ (సౌదిఅరేబియా)

## బొమ్మల మహాభారతం

స్వామి అయ్యప్ప ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాల ఆకర్షణీయంగా ఉంది. బొమ్మల మహాభారతం చాల ఆసక్తిదాయకంగా ఉంది.

బి ప్రభాకరరావు [విశాఖపట్నం]

## గమనిక

గత వారం (29-1-82) సంచిక 7వ పేజిలోని పెద్దల 'పెన్‌ఫ్రెండ్'లో మొదటి కాలమ్‌లోని మాటలు మూడవ కాలమ్‌లో, మూడవ కాలమ్‌లోని మేటర్ మొదటి కాలమ్‌లో పడింది. పాఠకులు గమనించగోరుతున్నాము పొరపాటుకి చింతిస్తున్నాము.

—సం॥

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 5–2–'82
దుర్మతినామ సం. మాఘ. శు. ద్వాదశి
సంపుటము 75 : సంచిక 22

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్ట్‌లో ఏడాది చందా రు. 67–60
ఆరు మాసాల చందా రు. 33–80
విడిప్రతి వెల రు. 1–25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003

## విషయానుక్రమణిక



## లోకం పోకడ :: డీశిమెన్

త్వరలో 7 గవర్నర్ పదవులకి ఖాళీలు ఏర్పడనున్నాయి..
వ్యక్తిగతంగా ఇక్కడ దరఖాస్తు చెయ్యండి.
"ఈ పదవికి మీకున్న ప్రధానమైన అర్హత ఏమిటనుకుంటున్నారు?"..?
"నేను వృద్ధుడిని"

బందిపోట్లకి ఆశ్రయం ఇస్తున్నదెవరు?
రాజకీయ వాది
బందిపోటు
నేనిక్కడ క్షేమంగా ఉంటాను

బొంబాయి తీర్పు అనంతరం..
ఈ బురదని కడుక్కోడానికి నాక్కాసిని నీళ్లు కావాలి
అంతులే

కారుని ఎలా నడపాలో నీకు నేను నేర్పుతున్నాను
సలహా సంఘం
అసహనైన అధికారం
ప్రజాస్వామ్యానికి తగినట్లుగా ప్రజలని తయారుచేయడానికి పాకిస్తాన్ నియంత జియా ఒక సలహా సంఘాన్ని ఏర్పాటు చేశారు.

పెద్దకథ

# పెన్ ఫ్రెండ్

టి.యస్.ఎ. కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

విజయభారతి వాళ్ళ ఇల్లు పెద్దదీకాదు, చిన్నదీ కాదు. మధ్యరకం పెంకుటిల్లు. విజయవాడలో కాలనీలలో స్వంతం పెంకుటిల్లు వున్నాయన్న మాట అనుకున్నాను. ఇంటి ముందున్న పూలతోట పెంకుటిల్లు అందాన్ని ఇనుమడింపు చేస్తోంది. ఇనుపగేటు తోసుకుని క్రోటన్సు మధ్యనున్న గచ్చు నేలమీద పది పన్నెండు అడుగులు వేశాను అంతలో గబగబా ఎదురు వచ్చింది విజయభారతి

"నేనే విజయభారతిని" అంటూ చేతులు జోడించి నమస్కారంచేస్తూ.

పొడుగ్గా, లావుగా, నల్లగా వుంది ఆమె. కొంచెం కుంటుతున్నట్లు కూడా గ్రహించాను. "నల్లని విత్తుగావున్నా ముఖంలో కళ వుంది" అనుకుంటూ ప్రతి నమస్కారం చేశాను విఐయర్ బ్యాగు క్రిందపెట్టి.

ఆమె బ్యాగ్ అందుకుని లోనికి నడిచింది.

ఆమె వెనకనే ఇంట్లో ప్రవేశించిన నేను హాల్లోని ఓ పేముకుర్చీలో కూర్చుని బూటు లేసులు వదులు చేసుకున్నాను. హాలు చాల పరిశుభ్రంగా వుంది. తెల్లటి గోడల మీద జాతినాయకుల ఫోటోలున్నాయి. ఓ మూల ఉన్న టేబిలుమీద ఫిలిప్సు రేడియో, టేబిలు లైటు, ఫ్లవర్‌వాజు వున్నాయి. ఫ్లవర్‌వాజ్‌లో అప్పుడే కోసినట్లున్న పూవులున్నాయి. నాలుగు పేముకుర్చీలు. ఓ టీపాయ్ వున్నాయి.

రెండు గుమ్మాలు. ఒక గుమ్మం ఇంటి లోపలికని తెలుస్తూనే వుంది. ఇంకోగుమ్మం బహుశా ప్రక్కగదికి అయివుంటుంది. గుమ్మాలకు, కిటికీలకూ అందమైన కర్టెన్లున్నాయి. రెండు కిటికీల మధ్యనున్న చిన్న గూడులో అందమైన రాధాకృష్ణుల విగ్రహం, దాని ఎదురు గోడకున్న షెల్ఫులో విన్నోపుస్తకాలు!

'ఇల్లంతా శుభ్రంగా, ప్రశాంతంగావుంది; విజయభారతి మనస్తత్వం లాగే' అనుకుంటూండగా విజయభారతి వచ్చింది కాఫీ కప్పుతో.

"రాజారావు నేనే అయివుంటానని ఎలా అనుకున్నారు ?" అని అడిగాను కాఫీకప్పు అందుకుంటూ.

"వెరీసింపుల్ ... మీరు తప్ప మరెవరూ రారు ఈరోజు!" అంటూ నవ్వింది ఆమె. నవ్వినప్పుడు బావుంది ఆమె. అదోరకమైన వింత అందం.

'ఈమెతో జీవితం పంచుకున్నాక ఈమె ఇంకా ఎక్కువ అందంగా కన్పించవచ్చు నాకళ్ళకి' అనుకున్నాను.

"వేడినీళ్ళు సిద్ధంగా వున్నాయి. స్నానం చెయ్యండి, టిఫిన్‌చేస్తూ మాట్లాడు కుందాం" అంది ఆమె.

"స్నానం చేసేశాను ఇందాకే!" అంటూ ట్రెయిన్ ఎర్లీగా రావడం, నేను క్రిష్ణలో స్నానంచేసి గుడికెళ్ళిరావడం చెప్పాను.

"బలేవారే, రైలు ముందుగా వచ్చిందని నదికి వెళ్ళారా ?" అంటూ నవ్వుతోంది ఆమె ... నవ్వుతే అందంగానే వున్నట్లు కన్పిస్తూ.

ఇంట్లో ఆమె తప్ప మరెవరూ కన్పించక పోవడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమె తనవాళ్ళను గూర్చి ఉత్తరాలలో వ్రాయలేదు. శంకరం ఇక్కడికి వచ్చి తిరిగి వచ్చినప్పుడూ తను నాకేం చెప్పలేదు.

నా ఆలోచనలను గుర్తించిన దానిలా "నేను ఒక్కదాన్నే వున్నాను ఈ ఇంట్లో... ప్రస్తుతం!" అంది ఆమె

"అలాగా! మీకు బంధువులూ, అప్పులూ ...." అన్న ప్రశ్న అడగబోయి ఆగిపోయాను అడక్కుండా ఆ విషయాలు నెమ్మదిగా మాట్లాడుకోవచ్చు

"రండి మొదట టిఫిన్ తీసుకుందురు గాని" అంది ఆమె లోపలి గదులలోకి బయల్దేరబోతూ.

"కొంచెం ఆగండి ... టిఫిన్ తరువాత చేస్తాము. మొదట .. నేను ... నేను మీకు నచ్చానా?... చెప్పండి!"

అన్నాను అంతసడన్‌గా ఎలా అడిగానా అని నాకే ఆశ్చర్యం కలిగింది.

ఒక్కనిముషం నిశ్శబ్దం తరువాత "ఇంత హఠాత్తుగా అడిగితే ఎలాచెప్పనండీ!" అంది ఆమె కొద్దిగానవ్వి తలవంచ కుంటూ.

నిజమే! కొన్ని ప్రశ్నలకు హఠాత్తుగా జవాబులు లభించవు. బహుశా నేను చాలా మొరటుగా ప్రవర్తించి వుండవచ్చు, అంత సూటిగా అడగడంలో.

"అనుచితంగా ప్రవర్తించి వుంటే దయచేసి మన్నించండి నా మొరటు ప్రశ్న మిమ్మల్ని బాధిస్తే అందుకు వెయ్యి క్షమాపణలు. నేను ఏదయినా అనుకుంటే దానిగూర్చి విజయమో, ఓటమో తేల్చుకునే వరకూ ఆగలేను నామెంటాలిటీ అలాంటిది. మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనీ, మీతో నా జీవితాన్కి ఓ క్రొత్త అర్థాన్ని సంతరించుకోవాలనీ స్థిరనిశ్చయాన్కి నచ్చేశాను. ఈ విషయం అటో, ఇటో తెలిసేవరకూ నాకు తోచదు. బహుశా ఇది నాలోని వీక్‌నెస్ కూడా కావచ్చు!" అన్నాను.

ఆమె మౌనంగా నాకేసి చూస్తోంది.

"నన్ను గూర్చి మీకు నా ఉత్తరంలో, వ్రాసేశాను. మిమ్మల్ని గూర్చి సంపూర్ణంగా మీ వుత్తరాల ద్వారా తెలుసుకునేశాను. మనం పరస్పరం ఒకర్నొకరు చూసుకున్నాము ... మీకు నేను నచ్చానో లేదో తెలియాలి మొదట! నాది డేర్ అండ్ డెవిల్ నేచర్ అని మీరనుకుంటే క్షంతవ్యుడ్ని." అన్నాను మళ్ళీ.

"మీకు నేను నచ్చానా ?" ఎదురుప్రశ్న వేస్తూ తలవంచుకుంది ఆమె

"నచ్చకపోవడం అనే ప్రశ్నేలేదు!" అన్నాను స్థిరంగా.



"ఏదైనా ఆవేశంలో మీరు ఈ నిర్ణయాన్ని తీసుకున్నారేమో ? నేను కురూపిని ... అయినా ఒకరి జాలిని, సానుభూతిని మాత్రం భరించలేను బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రండి .. తాత్కాలిక ఉద్రేకాలలో తీసుకునే నిర్ణయాలు ఒక్కోసారి జీవితాల మీద దెబ్బ తీస్తాయి" అంది ఆమె తలవంచుకునే

"ఎంతో ఆలోచించి తీసుకున్న నిర్ణయం నాది ఆవేశంలో తాత్కాలిక ఉద్రేకంలో నేను ఏలాంటి నిర్ణయాలూ తీసుకోను అదే నాలోని స్పెషాలిటీ ... మీ వ్యక్తిత్వం, విశాల భావాలూ, ఆధునిక దృక్పథం నా మనసును ఏంతో అలరింపచేశాయి మీ అంతరంగిక సౌందర్యాన్ని వదులుకునేంత మూర్ఖుణ్ణి కాను. నేను మిమ్మల్ని ప్రేమించ దలచుకున్నాను, పెళ్లి చేసుకుని జీవితం పంచుకో దలచుకున్నాను... ఇందులో ఆకర్షణ తప్పితే జాలి, సానుభూతి అనేవి లేవు"

అన్నాను సిగరెట్ పాకెట్ తెరచి సిగరెట్ వెలిగించవచ్చో కూడదో అని అనుమానిస్తూ.

"మీరు నిరభ్యంతరంగా సిగరెట్ కాల్చుకోవచ్చు. ఒక ప్రశ్న ... మన పెళ్ళయి కొంత కాలం గడచిపోయాక మీకు నా అనాకారితనం పైన అసహ్యం కలిగితే ?"

విజయభారతి ప్రశ్నవిని నేను కొద్దిగా నవ్వాను, విల్స్‌పేక్ లాంగ్‌సిగరెట్ వెలిగించుకుని పొగపీల్చి ఉత్సాహంగా వదిలిపెట్టాను.

"ఒక విషయం చెపుతాను వినండి. నాకు చిన్నతనం నుండీ బొగ్గు బళ్ళంటే మహా ఇష్టం. బొగ్గు రైళ్ళనూ, గూడ్సులనూ చూస్తూ ఎంతో ఆనందం అనుభవిస్తాను. బొగ్గు బండిని చూసి నేను పొందే ఆనందంలో మారవ వంతయినా పొంది వుండడు 'సెగ్‌ఫ్రెడ్ ససూమే' బొగ్గు బండి మీద పద్యాలు వ్రాసినప్పుడు కూడా. అంత ప్రాణం నాకు బొగ్గు ఇంజనంటే.

ఈ మధ్య అందమైన డీజలు ఇంజన్లు, ఇంకా అందమైన ఎలక్ట్రిక్ ఇంజన్లూ వచ్చేశాయి...కానీ రాక్షసిలా కనిపించే స్టీం ఇంజను కలిగించే ఆహ్లాదం ఈ గ్లామరస్ డీజల్, ఎలక్ట్రిక్ ఇంజన్లు కలిగించవు. నాకు స్టీం ఇంజను కన్పించినంత అందంగా మరే వస్తువూ కన్పించదు ఈ ప్రపంచంలో.

ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే మన పెళ్ళయి కొంతకాలం గడిచాక మీ అంత

అందమైనవ్యక్తి ఈ ప్రపంచంలో మరెవరూ లేరని అన్పించవచ్చు ... 'ఫస్ట్ ఇంప్రెషన్ ఈస్ ది బెస్ట్ ఇంప్రెషన్' అన్నారు అందుకే!"

"దయచేసి క్షమించాలి!" అంది ఆమె.

"ఎందుకని?" అన్నాను కంగారుగా. బహుశా ఆమెకు నేను నచ్చకపోయి ఉండవచ్చు.

"నేను విజయభారతిని కాను. నా పేరు రాధాదేవి. నేను విజయభారతి స్నేహితురాలిని. నిజంచెప్తున్నాను...నేను నా బావ కిషోర్‌ను ప్రేమిస్తున్నాను. నాబావకూడా దేవుడిలాంటి వ్యక్తే...మీలాగే! త్వరలో మా పెళ్ళి జరగబోతోంది కూడా...త్వరలో...ఇదంతా...'

"వాట్, వాట్ ఆర్‌యూ టెల్లింగ్?" అని అస్పష్టంగా అడగగలిగాను నేను దిగ్భ్రాంతిలోంచి.

"నేను ఇప్పుడు చెపుతున్నది నిజం. విజయభారతి నా స్నేహితురాలు. చాల అందమైనదీ, తెలివైనదీ. చక్కటి వ్యక్తిత్వం కలిగినదీ కూడా. ఆమె అందాన్ని చూసి ముందుకు వచ్చే వ్యక్తుల మనస్తత్వాలు తనకి నచ్చక తన వివాహ విషయంలో ఇలా నాటకం ఆడి తనకు తగిన వ్యక్తిని ఎన్నుకోదలచుకుంది ఆమె. ఈ నాటకంలో చివరివరకూ నిలబడి గెలిచిన వారు మీరు ఒక్కరే. విజయభారతి వాళ్ళ ఇల్లు ఈఇంటికి ఎదురుగా వున్న ఆరంగుల మేడే! ఆమె తండ్రి రిటైర్డు మేజిస్ట్రేటు. తల్లిదండ్రులకు ఒక్కతే కూతురు... తను బి.ఏ. లిటరేచరు...క్లాసులో ఫాసయింది."

రెండునిముషాలపాటు అచేతనంగా కూర్చుండిపోయాను. గుమ్మంలోంచి కన్పిస్తున్న ఎదుటిమేడ నన్ను వెక్కిరించినట్లు ఫీల్ అయ్యానుకూడా. రాధాదేవిగా మారిన ఆమెను చూస్తూంటే నామీద నాకే కోపం వచ్చింది, నేనో పెద్ద ఫూల్‌ని అయినందుకు.

వంగి బూటు లేసులు బిగించుకున్నాను. ఆతరువాత లేచి నిలబడి నా ఎయిర్‌బ్యాగు అందుకున్నాను.

"క్షమించాలి రాధాదేవిగారూ...నేను వెళ్ళిపోతున్నాను. గుడ్‌బై!" అంటూ రెండడుగులు వేశాను.

"మీరు ... మీరు ... నాకు నచ్చారు!" కొద్దిగా కంపిస్తున్న మధురమైన కంఠస్వరం వినిపించింది

ప్రక్కకుతిరిగి చూశాను. కర్టెనుతొలగించి పట్టుకుని ప్రక్కగుమ్మంలో నిలబడివుంది ఒక యువతి ఆమె అందం చూసి నిజంగా ఆశ్చర్యపోయాను. ఎంతో అందమైన వాళ్ళు వుంటారని నాకు తెలుసు...కాని.. రాజస్థాన్ లోని జైపూర్ ప్రాంతంలో ఇంత అందమైన వాళ్ళుంటారని విన్నాను తప్ప విజయవాడలో నాకు ఇంత అందం తటస్థపడుతుందని ఎప్పుడూ అనుకోలేదు నేను.

ఆమె పొడుగరికాదు, పొట్టీకాదు. గులాబీ రంగు శరీరచ్ఛాయ కలిగివున్న ఈమెను బహుశా బ్రహ్మదేవుడు మైక్రోమీటరుతో

కొలతలు పెట్టి నేరుగా సృష్టించి వుండాలి. ప్రతి ప్రబంధ కవీ కావ్యంలో ప్రతిదీ వర్ణించే చంద్రబింబం లాంటి ముఖం అంటే ఈమెదే అయివుండాలి. ఎర్రటి పెదవుల వెనుక ముత్యాలవరసలా మెరుస్తున్న తెల్లని దానిమ్మగింజలలాంటి పలువరుస, కోటేరులాంటి ముక్కు, చేపల కన్నుల వంటి కన్నులు, విశాలమైన ఫాలభాగం, నొక్కుల జుట్టు కలిగియున్న ఈ యువతి నిజంగా అద్భుతసౌందర్యరాశి అనుకున్నాను.

లేత నీలంరంగు షిఫాన్ చీర, అదేరంగు జాకెట్టు ధరించి నీలిరంగు గాజులు, నీలిరాళ్ళ కమ్మలు, నీలిరంగు ముక్కు, నీలిరాళ్ళ వంకీ వుంగరం మొదలైనవి ధరించివున్న ఆమె దివినుండి భువికి దిగివచ్చిన అప్సరసలా వుంది.

అయితే ఆమె అంగం, ఆమె ముఖంలో ద్యోతకమవుతున్న అమాయకత్వం నాలో రేగిన కోపాన్ని ఏమాత్రం తగ్గించలేకపోయాయి.

"స్వారీ ఇంతకాలమూ నన్ను ఏమార్చిందన్నమాట! ఒరిజినల్ విజయభారతిగారూ ... ఐయాం సారీ. అనాకారి అయిన ఓ గొప్ప యువతిని పెళ్ళిచేసుకోవాలనే నిశ్చయంతో నేను ఇక్కడికి వచ్చాను. కానీ నా నిశ్చయంలో ఇన్ని లోపాలు వున్నట్లు తెలియదు. నేను వెళ్ళిపోతున్నాను... ఫూల్‌ని అయినందుకు." అన్నాను కోపంగా.

"లేదు.. మీరు వెళ్ళగూడదు, వీల్లేదు" అంది ఆమె ఒకడుగు ముందుకువేసి. ఆమె కళ్ళలో గిర్రున నీరు తిరగడాన్ని గమనించాను నేను.

ఆమె కన్నీరు చూశాక నాకూ ఏదో ఆవేదన కలిగింది. అయినా ఏదో పిచ్చి కోపం ఆవేదననూ, బాధనూ అణచిపెట్టింది.

"లేదు. నేను వెళ్ళాలి...వెళ్ళితీరాలి!" అని రెండడుగులు వేశాను.

"క్షమించండి. ఒక్కపూట భోజనం అయినా చేయకుండా మీరు వెళ్ళిపోతే నేను జీవితాంతం బాధపడాల్సి వస్తుంది".

అంది రాధాదేవి బాధగా.

"అవును.. మీరు...మీరు ... యూ ఆర్ ఎ గ్రేట్ జంటిల్‌మెన్. మీరు కనీసం నాకో స్నేహితుడిగా అయినా ఉండిపోవాలి. మీరు మా ఆతిథ్యం తీసుకోకుండా వెళ్ళడానికి వీలులేదు...ప్లీజ్!" అంది విజయభారతి.

"దయచేసి ఈ ఒక్కరోజు ఆగండి. విజయ నాళ్ళింట్లో మా బావగారు, మా అమ్మా నాన్న ఉన్నారు. మీకు వార్ని పరిచయం చేయాల్ని. దయచేసి కూర్చోండి." అంది రాధాదేవి.

"రాధాదేవిగారూ! మిమ్మల్ని బాధిస్తున్నందుకు అనేక క్షమాపణలు. నేను ఇక ఇక్కడ ఉండలేను" అంటూ ముందుకు నడిచాను.

వీధిలోకి వచ్చాక నాకు ఒక అనుమానం కలిగింది. 'అనుమానం ... ప్రాణసంకటం' ఎందుకనుకుని అనుమానం నివృత్తి చేసుకోడం కోసం మళ్ళీ ఇంట్లోకి అడుగులు వేశాను.

రాధాదేవి, విజయభారతి గబగబా ఎదురొచ్చారు. రాధాదేవి ముఖంలో ఆనందం, భారతి అందమైన పెద్ద పెద్ద కన్నులలో ఆశ.

శంకరం ఓ పెద్ద స్టుపిడ్. వాడు ఇక్కడికి వచ్చినపుడు కనీసం సభ్యతకోసం అయినా కాస్త ఓపికగా ప్రవర్తించి వుండి వుంటే వాడి అంత అదృష్టవంతుడు మరొకడు వుండేవాడు కాదు.

"ఒక ప్రశ్న!" అన్న నా వైపు నిరాశగా చూశారు ఇద్దరూ.

"శంకరానికి వ్రాసిన ఉత్తరాలలోని భావాలూ, ఆశయాలూ ఎవరివి?"

"నావే!" అంది విజయభారతి ఉత్సాహంగా.

అయితే ఆమె ఉత్సాహాన్ని నిరుత్సాహంగా మారుస్తూ "కృతజ్ఞతలు!" అంటూ వెనుతిరిగి వచ్చేశాను ... వారి అభ్యర్థనలను వినిపించుకోకుండా.

ఐదు నిముషాలపాటు నిలబడ్డా రిక్షాకానీ, ఆటోగానీ, టాక్సీగానీ ఏదీ రాలేదు అటుగా ఖాళీగా.

"కనీసం మా ఇంటికి వచ్చి ఓ కప్పు కాఫీ అయినా త్రాగివెళ్ళాలి మీరు" అంది విజయభారతి నా వెనుకగా వచ్చి నిలబడి.

"దయచేసి మన్నించండి!" అన్నాను వెనక్కి తిరిగి చూడకుండానే.

"విసిగిస్తున్నందుకు మన్నించాలి. మీకు అభ్యంతరం లేకపోతే మీతోపాటు రైల్వేస్టేషను వరకూ వస్తాను నేనుకూడా!" అంది ఆమె.

వెనక్కి తిరిగి నా వెనుకే నిలబడ్డ ఆమెను చూశాను—ఆమె కన్నులలోని అభ్యర్థనను చూశాక కాదనలేకపోయాను.

"మీ ఇష్టం" అన్నాను.

"మీ బ్యాగ్ ఇలా ఇవ్వండి నేను పట్టుకుంటాను ... కొంచెందూరం నడుస్తూ వెళ్దాము" అంది ఆమె చేయిచాచి ముందుకు వస్తూ.

మొదటిసారి కొత్తగా చూశాను ఆమెను చూసి.

"వద్దు నేనే పట్టుకుంటాను, వెళ్దాము పదండి" అన్నాను ముందుకు అడుగేస్తూ.

నెమ్మదిగా నడుస్తున్నాము రోడ్డమ్మట— విజయభారతి తను తన వివాహం విషయంలో చేసుకున్న నిర్ణయాలు, అలాంటి నిర్ణయాలు



# పెన్ ఫ్రెండ్

తీసుకోవడానికి దోహదం చేసిన సంఘటనల్ని, తను రాధాదేవి సహకారం కోరి ఆమెను ఒప్పించడం మొదలైనవి చెపుతోంది తగ్గు స్వరంతో కానీ నాలో చలనం రావడంలేదు

వింత మా తమూ టాక్సీ ఒకటి ఎదుర యింది ఖాళీగా. దానిని ఆపి అందులో ఎక్కాము

"రాధాదేవి విజయభారతి కాదని తెలియగానే మీకెంత కంత నిరుత్సాహం ఆవహించింది?" అని అడిగింది ఆమె

ఈ ప్రశ్న నన్ను నేను ప్రశ్నించుకున్నాను అప్పటికీ సరయిన జవాబు తెలియ లేదు. రూపవతీ, విద్యావతీ, సంస్కారవతీ అయిన విజయభారతి నాలో ఎందుకు ఆసక్తి రేకెత్తించలేక పోయింది?

బహుశా నాలో అంతర్గతంగా ఉండే ఉడుకుమోత్తనం వలన కావచ్చు. లేదా తీసుకోక తీసుకున్న ఒక ఉదాత్తమైన నిర్ణయం ఇలా వీగిపోయినందువలన అయినా కావచ్చు మనసనేది రెండురకాల చొక్కాలు కాదు కదా ... ఒకటివిప్పి మరో చొక్కా తొడుక్కున్నట్లు ... ఓ అనాకారి యువతిని చేసుకోవాలని వచ్చి...అద్భుతసౌందర్యరాశి లభిస్తే ఆమెను చేసుకునేయడానికి?

"మీ ప్రశ్నకు సరయిన జవాబు చెప్పలేను నేను!" అన్నాను!

టాక్సీ రైల్వేస్టేషను చేరింది.

టిక్కెట్లు కొనేసి ప్లాట్‌ఫాం మీదికి వచ్చేను విజయభారతితో పాటు.

"ఏమండీ ... ఒక్కసారి మా ఇంటికి రండి...భోంచేసి మళ్ళీ వెంటనే వచ్చేద్దాము. నాకు ఆ తృప్తి అయినా మిగల్చివ్వండి. టాక్సీలో వెళ్ళి, టాక్సీలో వచ్చేద్దాము గంగా కావేరిలో కానీ తప్పినా జయంతి జనతాలో కానీ వెళ్ళిపోవచ్చు మీరు జర్నీ బోర్ లేకుండా!" అంది ఆమె.

నేను జవాబు చెప్పలేదు.

"దాదాపు మూడుగంటలు ఆలస్యంగా నడుస్తున్న థర్టీసెవన్ ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫాం నంబరు మూడు మీదికి కొద్దినిముషాల్లో రానున్నది" అంటూ అద్భుతమైన కంఠ స్వరంతో తెలుగు, ఇంగ్లీషు, హిందీ బాషలలో అనౌన్స్‌మెంటు వినిపించడం మొదలు పెట్టింది.



# చేనేతకు చేయూత

ఆంధ్రప్రదేశ్ 6 లక్షల మగ్గాలతో దేశంలో చేనేత రంగంలో అగ్రగామిగా వుంది మన రాష్ట్రంలో 30 లక్షల మంది ప్రజలు ఈ పరిశ్రమ మీద ఆధారపడి జీవిస్తున్నారు ఇటీవలి సంవత్సరాలలో చేనేత వస్త్రాల ఉత్పత్తిలోనూ, విక్రయంలోనూ గణనీయమైన ప్రగతి సాధించారు.



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధాన మంత్రి)

శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి

★ రాష్ట్రంలో చేనేత పరిశ్రమ రంగంలో ఐదవ పంచవర్ష ప్రణాళిక ఆఖరునాటికి (1979-80) రు. 80 కోట్ల విలువచేసే వార్షిక ఉత్పత్తిని సాధించారు.

★ వార్షికంగా 320 మిలియన్‌మీటర్ల చేనేత వస్త్రాలు ఉత్పత్తి చేస్తున్నారు.

★ 3.28 లక్షల మగ్గాలను సహకార సంఘాల పరిధిలోకి తేవడంద్వారా చేనేత మగ్గాలను సహకార రంగం పరిధిలోకి తేవడానికి రాష్ట్రప్రభుత్వం అత్యధిక ప్రాధాన్యత నిస్తున్నది. ఇందువల్ల మారుమూల గ్రామాలలో విస్తరించి వున్న వ్యవస్థీకృతం కాని చేనేత పనివారికి ఆర్థిక సహాయం ముడి సరుకులు లభింపజేయడానికి అవకాశం కలుగుతున్నది. ఆరవ ప్రణాళిక కాలంలో మరొక లక్ష మగ్గాలను సహకార సంఘాల పరిధిలోకి తెస్తారు.

★ తగిన కార్య నిర్వహణా పెట్టుబడి విక్రయ సౌకర్యాలులేని కారణంగా మూలపడిన 1.75 లక్షల మగ్గాలను పునరుద్ధరించాలని కూడ ప్రతిపాదించారు. 6వ ప్రణాళిక కాలంలో ఇందుకోసం రు. 500 లక్షలు కేటాయించారు.

★ 1975 76లో ప్రాథమిక చేనేత పనివారల సంఘాల వాటా పెట్టుబడి ధనం రు. 126 లక్షలు ఉండగా 1980-81లో రు. 595 లక్షలకు చేరుకుంది. 1975లో రిజర్వుబ్యాంకు ఋణాలు రు. 158 లక్షలు ఉండగా 1981లో రు. 8 కోట్లకు అనేక రెట్లు పెరిగింది.

★ అనుబంధ ప్రాథమిక సంఘాలకు విక్రయ సౌకర్యాలు అందజేయడంలో అపెక్స్ సహకార సంఘాలు కూడ సహాయం అందజేస్తున్నాయి. ఆరవ ప్రణాళికలో ఇందుకోసం 470 లక్షల రూపాయలు కేటాయించారు.

★ ఆప్కో సంస్థ ఆధ్వర్యంలో మన రాష్ట్రంలోనూ వెలుపల 432 విక్రయశాలలు, 5 చేనేత కేంద్రాలు ఉన్నాయి. ఆప్కో సంస్థ 1975 76 సంవత్సరంలో రు. 674 లక్షల మేరకు వ్యాపారం నిర్వహించగా 1980-81 సంవత్సరంలో రు 2,332 లక్షల మేరకు వ్యాపారం నిర్వహించింది.

★ బలహీన వర్గాలవారి నిమిత్తం 1976-77 లో 458 లక్షల చదరపు మీటర్ల జనతా వస్త్రాలు ఉత్పత్తికాగా 1980-81 లో 310 లక్షల చదరపు మీటర్లు ఉత్పత్తి చేశారు. ఈ కార్యక్రమం క్రింద 1.65 లక్షల, మందికి ఉపాధి కల్పిస్తూ 33,000 మగ్గాలు పనిచేస్తున్నాయి.

★ మేలిరకం వస్త్రాల తయారీకి వీలుగా ఆధునిక, సాంకేతిక విజ్ఞానంతో మగ్గాల ఆధునికీకరణకు, వస్త్రాల తయారీకి అవసరమైన నేతకు పూర్వం ఆ తర్వాత కావలసిన సౌకర్యాల కల్పనకు చర్యలు తీసుకుంటున్నారు. ఇందుకోసం గణనీయమైన రీతిగా రు 368 లక్షలు కేటాయించారు.

---

సమాచార, పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము.

D.I.P.R No. 45701/Advt/C1-3/81 Advt No. 57

## పెన్ ఫ్రెండ్

మౌనంగా పెట్టెక్కి మూడవ నెంబరు ప్లాట్‌ఫాం మీదికి దిగాను.

"నాకు నచ్చిన వాళ్ళు ఎవరూ తటస్థ పడలేదు ఇంతవరకూ. మిమ్మల్ని చూడగానే మీ భావాలన్నీ తెలుసుకోగానే మీరు తప్ప మరెవరూ మీలా వుండరని గ్రహించాను. మీ మీద నమ్మకం, ఇష్టం కలుగుతున్నాయి నాకు. మీరు నాకోసం మీ నిర్ణయాన్ని మార్చుకోలేరా?" అని దీనంగా అడిగింది ఆమె.

"క్షమించండి!" అన్నాను ముక్తసరిగా. అయితే ఆమె డబుల్ నెగెటివ్‌ను మాత్రం మనసులోనే అప్రిషియేట్ చెయ్యకుండా వుండలేకపోయాను. చాలా పెద్ద పరిచయం లోనే నన్ను చదివి నాతో జీవితం పంచుకోవడానికి ఇష్టపడటం అంటే సామాన్యమైన విషయం కాదు.

"కనీసం అప్పుడప్పుడు ఉత్తరాలయినా వ్రాస్తుంటారా?"

"చెప్పలేను!"

"బహుశా ఇంకను పెళ్ళి అనే విషయంలో ఆసక్తి చూపకపోను. నాలోని యవ్వనం తాలూకు స్పిరిటు మరి ఏ విషయాల పైన అయినా మళ్ళీ వినియోగం చేస్తాను. వస్తాను!" అంది ఆమె.

నాలో సంఘర్షణ ప్రారంభం అయింది అప్పుడు.

ఒక జీవితాన్ని సగానికి పూర్తిగా చెయ్యబోతున్నానా? అనే అనుమానంలో పడ్డాను నేను. ఈ సన్నివేశం నాకూ బాధగానే వుంది.

బొంబాయినుంచి కీచుగా అరుస్తూ, బుసలు పెడుతూ, ఆవిరి వదుల్తూ, అందంగా నెమ్మదిగా వచ్చి నెమ్మదిగా ఆగింది ముప్ఫైనాల్గా ఎక్స్‌ప్రెస్. అంత రద్దీగా లేని ఓ రిజర్వేషన్ కంపార్ట్‌మెంటులో ఎక్కి ఖాళీగా వున్న ఓ సీట్లో ఎయిర్‌బ్యాగు పడేసి క్రిందికి దిగివచ్చాను.

రైలు చాలసేపు ఆగిపోయింది. కలకత్తా నుండి బొగ్గు ఇంజన్‌తో నడిచి వచ్చాక ఇక్కడ్నుండి ఎలక్ట్రిక్‌తో నడుస్తుంది ఈ రైలు మద్రాసు వరకూ.

ఆమెను నేనూ, నన్ను ఆమె చూసుకుంటూ మౌనంగా విచారించి పోయాము చాలసేపు

నాకు బాగా ఆకలిగా వుంది. "ఇద్దరం కలిసి రైల్వేకాంటీన్‌లో టిఫిన్ చేసివున్నా బావుండేదే ?" అనుకున్నాను. ఆ లోపు రైలు బయల్దేరుతున్నట్లు కూత పెట్టనే పెట్టింది, అనౌన్సుమెంటు ప్రారంభం అయింది.

"గుడ్‌బై !" అంటూ కంపార్టుమెంటు లోకి ఎక్కి తలుపువద్ద నిలబడ్డాను. కానీ సంఘర్షణ నా బుర్రను గందరగోళంగా తయారు చేస్తోంది.

రైలు కదిలింది మెల్లిగా...కళ్లనుండి జారిపోతున్న కన్నీటిని తుడుచుకోకుండా నన్నే చూస్తోంది ఆమె అచేతనంగా నిలబడి.

ఉవ్వెత్తుగా లేచాయి సంఘర్షణా తరంగాలు నా మనసులో. రైలు వేగం అందుకుంది.. కొన్నిక్షణాలు గడిచాయి.

సందేహించకుండా వేగం పుంజుకుంటున్న రైల్లోంచి ప్లాట్‌ఫాం మీదికి ఒక్కదూకు దూకాను.

అదృష్టం ... క్రిందపడి మూడుసార్లు పొర్లినా, ఓ స్తంభాన్ని తాకి ఆగినా పెద్ద దెబ్బలేమీ తగలలేదు నా బట్టలు బాగా నలిగిపోయి దుమ్ముకొట్టుకు పోయాయి.

లేచి నిలబడి కాళ్ళూ చేతులూ సవరించుకుంటున్న నన్ను ఎవరో తిడుతున్నారు స్వచ్ఛమైన ఇంగ్లీషులో.

అంతలో వేగంగా పరిగెత్తుకు వచ్చిన విజయభారతి పబ్లిక్ ప్లాటుఫారం మీద అంత మందిలో లతలా పెనవేసుకుపోయింది నన్ను. అదే క్షణాలలో అవతలి ప్లాట్‌ఫాం మీదకు దూసుకు వస్తున్న డీజిలు ఇంజను రైలు నా కండ్లకు అద్భుతంగా కన్పించింది. ఆమె శరీరస్పర్శ నన్ను పులకరింప చేయడమేకాదు, ఆనందలోకాలలో విహరింపజేసింది కొన్ని క్షణాలపాటు.

విచిత్రంగా చూస్తున్న అనేక జతల కంటి చూపులను దాటుకుంటూ మెట్లెక్కి స్టేషన్ వెనుక త్రోవమ్మట దిగి గాంధీ హిల్ రోడ్డు లోకి వచ్చాము. టాక్సీ సులభంగానే దొరికింది.

నన్ను జాగ్రత్తగా టాక్సీలో కూర్చోబెట్టి, నా ప్రక్కనే కూర్చుంది విజయభారతి, డ్రయివర్‌కు ఎక్కడికి వెళ్ళాల్సిందీ చెప్పి. ఆమె నా చేయి వదలడం లేదు ... ఎక్కడ పారిపోతానో అని ఆమె భయం కావచ్చు

ఆమె స్పర్శతో నా మనసంతా ఉల్లాసంగా వుంది.

"ఐయాం ఎ లక్కీ గర్ల్" అంది ఆమె.

"ఐయాం ఆల్సో ఎ లక్కీమాన్" అనుకున్నాను నా చేతిని పట్టుకున్న ఆమె మృదువైన చేతులను మరో చేత్తో స్పర్శించి ఆనందం అనుభవిస్తూ.

"ఏమండీ, మీ బ్యాగ్ ?" అంది ఆమె కంగారుగా, హఠాత్తుగా.

ఆమె చేతి వేళ్ళ స్పర్శలో ఆనందం అనుభవిస్తున్న నాకు ఆమె కంగారు వెంటనే అర్థంకాలేదు టాక్సీ అప్పటికే చాల దూరం వచ్చేసింది.

"డ్రయివర్ ! కారును ఆపి వెనక్కి త్రిప్పండి. మళ్ళీ స్టేషన్‌కు వెళ్ళాలి !" అంది ఆమె.

ట్రాఫిక్ డిస్టర్బెన్సులో టాక్సీ వెనక్కి తిరగడానికి ఐదు నిముషాలు పట్టింది.

"కంపార్టుమెంటు నెంబరు గుర్తుంచుకుని వుంటే బావుండేది అయినా రిపోర్టు చేస్తాము ... ఏదో ఒక స్టేషనలో బ్యాగు తీసుకోవచ్చు రైల్వేవాళ్ళు..." అంటూ ఏదో చెపుతోంది ఆమె నాకు అవేమీ విన్పించడం లేదు సరిగ్గా. నాకు తెలుస్తున్నది ... ఆమె చేతివేళ్ళ స్పర్శ సుఖం మాత్రమే. అయినా తేరుకుని అన్నాను ఇలా—

"ట్రెయిన్‌లోంచి దూకాలని ముందే తెలిసివుంటే కంపార్ట్‌మెంటు నంబర్ నోట్ చేసుకుని వుండేవాణ్ణి. అయినా వెధవ బ్యాగ్ పోతే పోయింది...అద్భుతమైన నిధి దొరికింది నాకు."

ఆమె, నా చేతిని ముద్దు పెట్టుకుంది సంతోషంగా.

టాక్సీ స్టేషను వద్ద ఆగింది. స్టేషను లోకి నడిచాము.

ఎ. యస్. యం. ని కలిసి నా బ్యాగ్ థర్టీసెవన్‌లో వెళ్ళిపోయిన విషయం తెలిపాము.

"ఎలాపోయింది, అసలు మీరెందుకు దిగేశారు ? ఏ కంపార్టుమెంటు ?" అని మహా నిర్లక్ష్యంగా అడుగుతూ నిదానంగా సిగరెట్ వెలిగించుకున్నాడు ఆయన.

ఒళ్ళు మండింది నాకు. నాకన్నా ఎక్కువ కోపం వచ్చిందేమో విజయభారతికి వెలుపలి నుండీ గదిలోకి వచ్చింది విసుగ్గా. వచ్చి నా ప్రక్కన నిలబడి కంపార్టుమెంటు రంగు, ఆ కంపార్టుమెంటు ట్రెయిన్‌లో ఆందానుగా ఎక్కడవున్నదీ, ఏ యిర్ బ్యాగు రంగూ వరుసగా చెప్పేసింది టకటకా.

"యస్ మేడం..." అంటూ చకచకా రాసుకుని ఓ ఫోన్ అందుకుని చకచకా మాట్లాడడం మొదలు పెట్టాడు.

"ఓర్నీ, నీ దుంపతెగా !" అనుకున్నాను.

అందమైన ఆడపిల్లకిచ్చే విలువ, అందమైన మగవాడికి ఇవ్వడు ఏ వెధవాయీ!

'ఈ అందమైన అద్భుతమైన యువతిని నా ప్రక్కన చూసినప్పుడూ, ఈమే అసలు సిసలు 'విజయభారతి' అని తెలిసినప్పుడూ, శంకరం భావాలు ఎలా వుంటాయో ?' అన్న ఆలోచనలో పడ్డాను నేను, విజయభారతి చెయి పట్టుకుని స్టేషను వెలుపలికి నడుస్తూ.

(అయిపోయింది)

ఇలా కోపంగా ఎందుకు సార్ చూస్తారు...మీరే కదా బీరు నడుం వంచి పని చెయ్యమన్నారు..??





## అనుకోని ఆపద !

మెట్టూరుకు చెందిన రమేష్ అల్యూమినియం ఫ్యాక్టరీ సొంతదారు 52 ఏళ్ల పురుషోత్తమన్ అనే ఆయన కొడుకు రమేష్, సురేష్ అనే ఇద్దరూ, ఆయన భార్య రాజమణి, ఆ కంపెనీ మేనేజరు రామచంద్రన్, ఆయన చుట్టం మురళి, వెరసి ఆరుగురూ కారులో బెంగుళూరు వెళ్తూ, హోసూరు దాటి కర్ణాటక రాష్ట్ర ఎల్లకు ప్రవేశించి, అత్తిబెలె అనే వూరు ప్రాంతంలో రోడ్డు పక్కగా కారు ఆపుకుని, ఇంటి నుంచి తెచ్చుకున్న టిఫిను తింటుండగా ఆ దారిన వెళ్లే లారీ గతి తప్పి, వీరి కారును భయంకరంగా మోదిందట. దాంతో రమేష్, రామచంద్రన్ అక్కడికక్కడే చనిపోయారట.

### తల పగులగొట్టుకు చనిపోయిన తాచుపాము!

గోధుమ వన్నె తాచుపాము పరమపవిత్రత కలవనీ, అవి మనిషి కంట పడవనీ, అలా పడితే వెంటనే ఆత్మహత్య చేసుకుంటాయనీ మన పెద్దలు చెపుతూ వుంటారు. కొత్తపేట (అమలాపురం దగ్గర) కు చెందిన అమలాపురం కాలువ ఒడ్డున పది అడుగుల పొడవున్న గోధుమ వన్నె తాచును కొందరు (నవంబరు 13 న) చూడడంతో ఆ తాచుపాము చూపినిబ్బరంగా నిల బడ్డదట. దాంతో మరింత మంది జనం పోగయ్యారట. అందరూ చూస్తుండగా ఆ పాము తన తలను ఓ బండరాయికేసి బాదుకుని, పడగ చిట్లి, నెత్తురు కారినా ఆగకుండా చచ్చిపోయేవరకు బాదుకుని, చనిపోయిందట. ఆ గ్రామవాసులా పాముకి యథాశాస్త్రం అంత్యక్రియలు జరిపి తొమ్మిదో రోజున బ్రహ్మేశ్వరుని పటము — నాగేంద్రుని పటము ఆ పాము తల బాదుకుని చనిపోయిన చోట పెట్టారట. ఆహా మనిషి తప్ప ఏ జీవరాశి నియమం తప్పదేమో ?

### ప్రచారం కోసం !

లార్డ్ అటెన్‌బరో చిత్రీకరించిన "మహాత్మా గాంధీ" చలనచిత్రం అత్యద్భుతమని కొలంబియా పిక్చర్స్ సంస్థ మెచ్చుకుని ఆ సినిమా పంపిణీ ప్రపంచహక్కులు తీసుకోడానికి ఒప్పుకున్నదట. కేవలం సినిమా పబ్లిసిటీకి గాను పన్నెండు మిలియనుల డాలర్లు ఖర్చుచేయ నిశ్చయించినట్లు ఆ కొలంబియా పిక్చర్స్ చైర్మన్ ఫ్రాంక్ ప్రయిజ్ చెప్పారట

## అప్పు తెచ్చిన ముప్పు !

ఏర్కాడు అనే వూరికి చెందిన 30 ఏళ్ల వెంకటసే అనే అతను గతి లేక వడ్డీకి వో పదిహేడొందలు అప్పు తీసుకు, తీర్చలేక, ఆ బాధ పడలేక తానింత విషం తిని, తన భార్య 25 ఏళ్ల అపదకూ యిచ్చి, ఇద్దరూ తనువు చాలించారట.

### రైలు ప్రమాదాలకి కారణం !

1980వ సంవత్సరం ఏప్రియల్ నుండి మే నెల వరకూ ఉన్న కాలంలో దేశంలోని రైల్వే విభాగంలోని రైళ్లలో 503 రైలు పట్టాలు తప్పిన ప్రమాదాలు, 37 రైళ్లు రైళ్లు ఢీకొనడాలూ సంభవించాయట. 1981వ సంవత్సరం యిదే కాలంలో 593 పట్టాలు తప్పిన సంఘటనలు, 49 ఢీకొనడాలూ సంభవించాయట. రైల్వే బోర్డు చైర్మన్ మిస్టర్ గుజ్రాల్ అంతకుముందున్న కొన్ని నిబంధనలు సడలించడం ఫలితమే యిది అని అనిపిస్తోందట. 350 కిలోమీటర్లు పరుగెట్టిన ప్రతి రైలు పెట్టెనూ విధిగా పరీక్షించేవారట. ఆయన ఆ పరిమితిని 1200 కిలోమీటర్లుగా పెంచారట. అంతేగాక ప్రతి పెట్టెలోనూ వెయ్యాల్సిన బరువుకన్నా ఎక్కువగానే వేస్తున్నారట. ఈనాటి రైలు ప్రమాదాలు దారుణంగా, భయంకరంగా కూడా ఉంటున్నాయి.

> ### "చూపు"
>
> హృదయం ...
> నరస్సు లాంటిది !!
> నరస్సులో రాయివేస్తే ... !
> వేసిన చోటేగాక ...
> మొత్తం చలిస్తుంది !!
> హృదయంలో ...
> ప్రియురాలు విసిరిన వాల్చూపు...
> విసిరిన చోటేగాక ...
> అణువణువు ప్రతి ...
> మొత్తం తనువంతా ...
> చలిస్తుంది !! పులకరిస్తుంది !!!
>
> —"సాయిబాబ"

## గాయత్రీ మంత్ర మహిమ !

ఢిల్లీలో రాజమార్గంలో నవంబరు 14వ తేది అల్లావారుజాము మూడుగంటలకు కాపర్స్ మినిస్ట్రీకి చెందిన చేనేత వస్త్ర విభాగానికి జాయింట్ సెక్రెటరీగా ఉంటున్న డాక్టర్ శేషాద్రి తన కారులో ఇంటికి వెళ్తుండగా ప్రగతిమైదానం ప్రాంతంలో తలపాగా చుట్టుకుని ఉన్న వో మానవ ఆకారం ఆ కారుని ఆపి లారీతో హత్య లారీ. . . హత్య" అనుకుంటూ మీదకు వచ్చిందట అది మనిషి కాదనీ, దయ్యమనీ గ్రహించి, తాను గాయత్రిని జపించేసరికి ఆ ఆకారం మాయమైపోయిందని ఆయన అన్నారు. ఆయన వేదాలలో స్కాలరుట. గాయత్రీ మంత్రంలో అంతటి శక్తి ఉన్నదని ఆయన పత్రికాముఖంగా ప్రకటించారట.

### నాన్సెన్స్ క్లబ్బులో కరప్షన్ శాఖ !

చండీఘర్‌లో "నాన్సెన్స్ క్లబ్" అనే ఒక క్లబ్బు వున్నదట. ఆ క్లబ్బుకు చెందిన కరప్షన్ శాఖను అదే వూళ్లో ప్రారంభించారట మొన్నా మధ్య. అతి నేర్పుగా గొప్పగా హాయిగా లంచాలు తీసుకోడం, అవినీతిపనులు మనాయాసంగా చేయడం వంటి వాటిలో అత్యధిక ఘనత వహించిన వారిని క్లబ్బు బిరుదు సన్మానాలతో సత్కరిస్తుందట. ముక్కున వేలేసుకుని ఆశ్చర్యపోయే విధానాలలో అవినీతినీ, లంచగొండితనాన్నీ అవలీలగా చేసి చూపిన ఘనుడికి చక్కని నజరానా ఈ క్లబ్బు చేస్తుందని ఆ క్లబ్బు ప్రెసిడెంటు జస్పాల్ యస్ భట్టి అన్నారట. నా క్లబ్‌కు మీ శుభాశీస్సులు కావాలెను అని వారు అంతా వేను కోరారట. ఓ భావిలి.

### దండోపాయం తెచ్చిన తంటా !

సేలం ఆరణ్య పోలీసుశాఖకు చెందిన సబ్ ఇన్‌స్పెక్టర్ పెరియసామి 1980వ సంవత్సరం ఆగస్టు నెలలో చందనం కర్రలు దొంగిలించిన నేరానికి సస్పెండ్ చేయబడ్డారట. ఆసకాయన తన వద్దనున్న డబ్బును వడ్డీలకు తిప్పసాగారంభించారట. తమ్మయ్యపట్టి గ్రామంలో ఒకతను తానుతీసుకున్న రెండూ తిరిగి ఇవ్వనేసట, వయినా, భయాన్ని అడిగినా లాభం లేకపోయేసరికి ఆ సామ, దాన, భేదం మీదుగా దండోపాయానికి వెళ్ళిపోయారట. ఆ ఫలితంగా అరెస్టు అయ్యారట— అవరేంటి మరి ?

### నెలకి 10 లక్షల మంది పిల్లలు !

దేశంలో ఈనాడు నెలకి పది లక్షల మంది పిల్లలు పుడుతున్నారని ప్రధాని ఇందిరాగాంధి అన్నారట. 1981వ సంవత్సరంలో ఆ నిర్ధారించిన జనాభా 13 కోట్ల 60 లక్షలట. ఈ పెరిగిన జనాభా మొత్తం ఫ్రాన్స్, తూర్పు, పశ్చిమ జర్మనీలలోని జనాభా కలిపినంతట. అసలు మనదేశపు మొత్తం జనాభా ఎంత! ఎంతో! చెప్పేలోగానే ఫిగరు మారిపోతే!




చిమ్మ చీకటి...

కుండపోతలా కురుస్తున్న వర్షం...

హోరుగాలికి తాగి తూలుతున్నట్టున్న చెట్లు ..

అందంగా గీసిన చిత్రంపై నీళ్ళు చల్లి వెటకారంగా వుందక్కడి ప్రకృతి.

వానకు ముద్దలా తడిసి చెట్టుకింద మునగదీసుకుని కూర్చున్న ముసలమ్మలా వుందా పూరిల్లు

"ఇంకా నిద్ర పోలేదా ?"

"కంటినిండా నిద్రపట్టే వయస్సా మనది?"

భయంగా వినిపిస్తున్న బయటి వానచప్పుళ్ళు వింటూ కూర్చున్నాడు బలరామయ్య నులక మంచంమీద నిద్ర పట్టక మరో మంచం మీద దొర్లుతోంది బసవమ్మ

'రేప్' సీన్‌తో గిలగిలా తన్నుకునే ఆడదిలా కొట్టుమిట్టాడుతోంది హరికెన్ లాంతరు వెలుగు.

"అబ్బాయి జాడే లేదు."

"నువ్వు పడుకోవే! ఈ గాలి వానలో వాడెక్కడ వస్తాడూ!"

"వస్తానని ఉత్తరం ముక్క రాశాడుగా! ఉదయం ఎపట్నో బియ్యం వేసు ంటే కాకి కూడా అరిచింది"

"కాకి అరవడానికేముంది గాని నువ్వు పడుకో! మళ్ళీ పొద్దున్నే లేగిస్తే గొడ్డులా యింటి పనంతా చేసుకోవాలి"– చుట్టపీక వెలిగించే ప్రయత్నం చేస్తూ అన్నాడు బలరామయ్య

అగ్గిపుల్లలు నెమ్ముకోవడంతో ఎంత ప్రయత్నించినా చుట్ట వెలగలేదు చూరులో దూరిన కొబ్బరిపీచు బయటకు లాగి దీపం దగ్గిర చేరేడు

"టప్... టప్" పై కప్పులోంచి నీటి బొట్లు దుప్పటిమీద పడి చప్పుడు చేశాయి. మంచం పక్కకు లాక్కున్నాడు.

చుట్టపీక పొగ బసవమ్మ ముక్కు పుటాలకు తగిలింది

"మళ్ళీ చుట్ట తాగకపోతేనేం? పగలల్లా దగ్గుతూ వుంటివి"– గొణిగింది బసవమ్మ.

"సరే పడుకో... నీ కెప్పుడూ నా చుట్టగోలే"

దాదాపు అరవయ్యేళ్ళనుంచి బసవమ్మ చుట్ట తాగొద్దని అంటూనే వుంది. తను వింటూనే వున్నాడు... ముసలితనం వొంటి నంతా కమ్మేసిన తర్వాత యిప్పుడీ అలవాటు మానతాడా?... చుట్ట తాగకపోతే ఏమీ తోచి చావదు...

...ముసల్ది తనని కంటికి రెప్పలా చూసుకోబట్టే తనే రోగం రొస్టు లేకుండా కాలం గడుపుతున్నాడు ఆమె యింట్లో లేకపోతే కాలు చెయ్యి ఆడదు ఎదురుగా వున్న చుట్టపీక కూడా కంటికి కనపడదు.

పాత ముచ్చటొకటి బలరామయ్య మెదడ్లో దూరింది.

పెళ్ళయిన కొత్తల్లో...

పాలపిడత పొయ్యిమీద నుంచి దింపి, పిడకలు ఆర్పేసి తన దగ్గిర కొచ్చింది నులక మంచంలో చోటిచ్చేడు తను

"పాలు తోడుపెట్టావా ?"

"పాలు యిప్పుడే కాగాయి. వేడి ఆరేక తోడ వేస్తాను"

"ఏం తొందరొచ్చిందని పక్కలో దూరావ్?" అన్నాడతను చిలిపిగా.

"ఛీ... చుట్టవాసన నీ దగ్గిర" అంటూ తన ముఖాన్ని పక్కకు పెట్టి వంటింటిస్తైపు పరుగెత్తింది

మెదడులో కదులుతున్న బసవమ్మ రూపును చెరిపేసి మనవరాలు గౌరి వచ్చింది.

... గౌరి పుట్టిన ఆరేళ్ల తర్వాత తీసు కొచ్చేడు కొడుకు.. అవును...వాడేంచేస్తాడు పాపం! దూరాభారం... చిన్న ఉద్యోగంతో పొట్ట గడవడమే కష్టంగా వుంటే చీటికీ, మాటికీ యిక్కడికి ఎలా వస్తాడు?...

కోడలు చచ్చిపోయినప్పుడు మాత్రం వొక్కసారి తను వెళ గలిగేడు .. అప్పుడే కొడుకు, మనవరాలు తనవెంట యిక్కడ కొచ్చేరు

# చెరిగినబొట్టు

గౌరి అచ్చంగా వాళ్ళ నాయనమ్మ పోలికే! బంగారపు బొమ్మ ...

పోట్లో బియ్యం పోసుకుని కళ్ళు చక్రాల్లా తిప్పుతూ తనదగ్గఱ కొచ్చింది. ఒళ్ళో కూర్చోబెట్టుకున్నాడు తను.

"ఏమిటే అంటున్నావు గౌరమ్మతల్లీ?"

నోరు తెరిచి చూపింది.

"ఛీ ... ఛీ పిసట్లో బియ్యం తెచ్చుకు తింటున్నావా? నీ పెళ్ళిరోజు వాన కురుస్తుందే!"

"వానకురిస్తే చించక్కా 'వానా...వానా వల్లప్పా!' అంటూ ఆడుకుంటా"

"వానలో తడిస్తే నీ మొగుడు వూరు కుంటాడా ఏమిటి?"

"ఇద్దరం కలిసి ఆడుకుంటాం."

"నీకు నోటి నిండా కబుర్లేనే తల్లీ! ఏదీ ఒక ముద్దు యివ్వమ్మా!"

"నాకు కందికాయలు తెచ్చిపెడితేనే!"

గౌరి బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు తను.

"ఛీ... నీ దగ్గఱ చుట్టవాసన" అంటూ తనను విదుల్చుకుని తుర్రుపిట్టలా పరుగెత్తింది.

...గౌరమ్మకి ఇప్పుడు పదహారేళ్ళట... అప్పుడే పదేళ్ళు గడిచాయా?... దానికి పెళ్ళి కూడ చేసేడుట రాఘవులు. కూతుర్ని అల్లుడిని తనకి చూపించడానికి తీసుకు వొస్తున్నానని ఉత్తరం కూడ రాసేడు... తెల్లారేటప్పటికన్నా రావాలి...

"ఎంతసేపలా కూర్చుంటావ్? పడుకో రాదూ!" అంది బసవమ్మ

"నీకు మాత్రం నిద్ర పట్టింది! మనవ రాలు వో యింటిదయితే చూడాలని కలవ రించేవ్... యిప్పుడది మన యింటికి వస్తుంటే మనకెలా నిద్ర పడుతుంది?"

"సర్లే! అర్ధరాత్రి యిప్పుడెందుకు కబుర్లు. నిద్రపో. నిద్రలేక వేడిచేసిందని గొడవచేస్తావ్ రేపు" అంది బసవమ్మ దుప్పటి కప్పుకుంటూ.

దాని మనసంతా తనమీదే! ముసలితనం ముసుగులోకి దూరినా తన మంచి చెడ్డల గూర్చే అది ఆలోచిస్తూ వుంటుంది. ఏ జన్మలో చేసుకున్న పుణ్యమో తనకు బసవమ్మ లాంటి భార్య దక్కింది... తన కళ్ళముందే

అది వెళ్ళిపోవాలనుకుంటుంది... బసవమ్మ లేకుండా తను రోజుల నెట్టుకు రాగలడా?

ఇద్దరూ వొక్కసారే చనిపోతే బావుణ్ణు!

.. ప్!... నిద్ర పట్టడం లేదు...

వయసులో వున్నప్పుడు ఎంత నిద్ర పోయేది? బండని ద పోయేవాడు తను... తనను నిద్ర లేపడానికి బసవమ్మ నానా యాతనలూ పడేది వొక్కొక్కసారి కోపం వొచ్చి చెంబుడు నీళ్ళు తలమీద గుమ్మరించేది. ఆ నిద్రంతా ఎటు పోయిందో? ..

...విశాలమైన ఛాతీ, వుంగరాల జుట్టు, నలుగుర్ని ఆకర్షించేటట్టు వుండే మీసకట్టు, ఉబ్బిన దండలతో దిట్టంగా ఉండేవాడు తను. వడ్లబస్తాలను అవలీలగా వొక్క సే కల్లంలో మండి ఎండ్లబండి మీద పడేసేవాడు...

...'ఏరువాక పౌర్ణమి' వొస్తుందంటే చాలు, వూరందరి కళ్ళు తనమీదే...

కొత్త పంచె కట్టుకుని కొత్త కండువా తలకు చుట్టుకుని పెళ్ళికొడుకులా తయారయ్యేవాడు నాన్న వూళ్ళో మోతుబరిరైతు ఏరువాక పౌర్ణమి వొచ్చిందంటే నాన్న అరక ముందు నడిచేది. ఆ తర్వాత పంటలు పండక అప్పట్లో పడి పొలమంతా తడిపేదుకు పొరు నా నాన్న అరకే వూరేగింపులో ముందు నడిచేది. నాన్న చనిపోయేక తను అరక ముందు నడిపే వాడు.

ఎడ్ల కొమ్ములకి పసుపు కుంకుమరాసి వూల దండలతో అలంకరించేది బసవమ్మ. అరక మెడలో తగిలించుకుని, గంటలు మోగిస్తూ తలలు ఎగరేసుకుంటూ ఎద్దులు నడుస్తూ వుంటే, వాటి వెనుక నడవడానికి తనకెంతో గర్వంగా వుండేది ముందు తన అరక సాగితే వెనుక వూళ్ళో అందరి అరకలు సాగేవి: వూరంతా కోలాహలంగా తిరిగేక, పొలంలోకి వెళ్ళి భూమాతకు పూజలు జరిపేవాళ్ళు.

ఆ రోజుల్లో అదో పెద్ద పండుగ.

ఇప్పుడు తనకి పట్టుకుందామన్నా అరక లేదు, నాగలి ఎక్కడన్నా అరువు తెచ్చుకున్నా వూళ్ళో యిప్పుడు ఆ ఆచారం లేదు.

మొన్నీమధ్య ప్రెసిడెంటుగారు ఎన్నికల్లో గెలిస్తే ఎంత పెద్ద ఊరేగింపు జరిపారో! ఎన్నికల్లో వున్నంత ఉత్సాహం రైతుల పండగల్లో వుండటంలేదు...

"తాటాకుల బుట్టలో మునసబుగారిచ్చిన అరటిపళ్ళు వున్నాయి. రెండు కాయలు తినేసి, మంచినీళ్ళు తాగి పడుకో" అంది బసవమ్మ

"ఓసి నీ దుంపతెగా! నువ్వు నిద్రపోవు. నిద్ర పట్టక కూర్చుంటే నన్ను సతాయిస్తావ్!"

"నాకు నిద్ర వొస్తోంది. నే పడుకుంటా. ముదనష్టపు గాలివానొకటి చీదరగా" కాసేపు గొణుక్కుని, అటూ ఇటూ పొర్లి నిద్రలోకి జారుకుంది బసవమ్మ.

మధ్యాహ్నం మునసబు నాయుడమ్మ వొచ్చేడు. ఆయన వెంట పెద్ద వటాలనే ఆడ, మగా తరలి వొచ్చారు.

వూళ్ళో వున్న ముత్తైదువుల్లో పెద్ద ముత్తైదువ బసవమ్మే! కొత్తగా పెళ్ళయిన వాళ్ళు, కాపురాలకి వెళ్ళేవాళ్ళు బసవమ్మ దీవెనలు తీసుకువెళుతూ వుంటారు. ఎనభై యేళ్ల ముత్తైదువ దీవెనలు మంచివని వాళ్ల నమ్మకం. వాళ్ల బతుకులు పదికాలాల

## గతం

మువ్వు నా ముందుంటే
నీ గురించి ఆలోచించని నేను
నువ్వు నన్ను దాటిపోతే
ఆరాటపడుతుంటాను
తిరిగిరావి నీ కోసం

— గద్దమణుగు గోపాలకృష్ణమూర్తి

పాటు పసుపు కుంకుమలతో పచ్చగా వుంటాయని వూళ్ళోవాళ్ళు తమ యింటికి వస్తూ వుంటారు.

"పెద్దయ్యా! నమస్కారం"! అన్నాడు మునసబు వచ్చీ రావడంతోనే.

పైకి నవ్వు ముఖం పెట్టినా, మనస్సులో తనకి బాధగానే వుంది ఎంత ముసలాడైనా ఎవ్వరన్నా "ముసలయ్యా, పెద్దయ్యా" అంటే ప్రాణం చివుక్కు మంటుంది. ఎనభై ఐదేళ్ల వయస్సు మీద పడినా, తన ఆలోచనలన్నీ పాతికేళ్లప్పటి జీవితం చుట్టూనే తిరుగుతూ వుంటాయి...

...తను యిప్పుడు 'పెద్దయ్య'... చేతి దండలు కరిగిపోయ్యాయిగా... విశాలమైన ఛాతీ కుంగిపోయి, ఎముకలు బయటికి పొడుచుకు వచ్చాయిగా... చప్పిడి దవడలు... ఉంగరాల జుట్టుకు బదులు అక్కడక్కడ తెల్ల వెంట్రుకలు... అవును తనిప్పుడు పెద్దయ్యే!

జారిపోయే లాగుతో, చిమిడి ముక్కుతో బలపంముక్క నోట్లో వక్క పొడి లా నములుతూ తిరిగిన సాంబయ్యగారి అబ్బాయి వూరికి మునసబు...

...ఎంత జీవితం దొర్లిపోయింది!...

"మా అమ్మాయిని యీ రోజు సాయంత్రం పెళ్లికూతుర్ని చేస్తున్నాం. పెద్దప్పని సాయంత్రం మా యింటికి పంపు ... పెద్దప్ప ముందు మా అమ్మాయి నొసట కుంకుమ దిద్దితే దాని పసుపు, కుంకుమలకి లోటుండదు. మన వూళ్ళో పెద్దప్ప చేత కుంకుమబొట్టు దిద్దించుకున్న ఏ ఆడకూతురి నుదుట బొట్టు చెరిగి పోలేదు...మీ రిద్దరూ పార్వతీ పరమేశ్వరుల్లా చల్లగా వున్నంతకాలం మనవూరికే దిగులు లేదు" అన్నాడు మునసబు నాయుడమ్మ నిలబడే, మంచంపై వున్న కోడిరెట్ట మరకలు అతన్ని కూర్చోనివ్వలేదు.

ఆ మాటా, ఈ మాటా మాట్లాడి వొచ్చినవాళ్లంతా తిరిగి వెళ్ళిపోయేరు.

వాళ్ళు వెళిపోయేక చేటలో బియ్యం పోసుకుని, మట్టిగడ్డలు ఏరడం మర్చిపోయి తనవంకే చూస్తూ కూర్చుంది బసవమ్మ.

"ఏమిటే! పిచ్చిమొహం వేసుకుని అలా చూస్తూ కూర్చున్నావ్?" అన్నాడు తను.

ఆమె కళ్లల్లో చటుక్కున నీళ్ళు తిరిగేయి.

"మనం చచ్చిపోతాం కదూ! మనం చావుకి దగ్గరవుతున్నామనే మనకీ పెద్దరికం అంటగట్టారు" అంది కళ్ళు వొత్తుకుంటూ.

"ఎల్లకాలం బతుకుతామంటే? ఆ దేవుడు ఎప్పుడు కబురు పెడితే అప్పుడెళ్లిపోతాం ... అయినా ఎవడన్నా మీ యిద్దరూ యాభై లు బతికేడే? సాయంత్రంపూట చావుకబుర్లు విందుకుగాని, పని చూసుకో"

"ఎల్లకాలం బతుకుదామని కాదు ... మీ కళ్ళముందే పసుపుకుంకుమలతో వెళ్లిపోతే చాలు."

"నీ గోల వీడే! నువ్వు చచ్చిపోతే ఇంటి పని, వంటపని నేను చేసుకోక తప్పదు నేను చీపురు, గరిటెతో చచ్చిపోతే... నాకంటే ముందు పసుపుకుంకుమలతో వెళ్లాలను కుంటున్నావ్" అని నవ్వేసేడు తను.

"మీకంతా నవ్వులాట" అంటూ తన పనిలో మునిగిపోయింది.

బుట్టలో చలికి ముణగదీసుకుని పడుకున్న

# చెరిగిన బొట్టు

కోడిపుంజు రెక్కలు విదుల్చుకుంటూ "కొక్కొరోకో" అంటూ కూసింది

ఉలిక్కిపడి కళ్ళు తెరిచేడు బలరామయ్య. పక్కదుప్పట్లు మడిచి లేచి నిలబడ్డాడు.

తలుపు తియ్యబోతుంటే, విసురుగా గాలి లోపలికి దూసుకు వొచ్చింది. బయట కుండపోతగా వొకటే వర్షం.

తలుపేసేసి లోపలికివొచ్చి కూర్చున్నాడు. బనీనుజేబు తడుముకుని వుండలు చుట్టిన పొగాకుపాయ బయటకు తీసేడు. చుట్ట చుట్టడం ప్రారంభించేడు.

.. తనకి బాగా గుర్తు. పదేళ్ళకిందట యిలాగే పెద్దగాలివాన ... ఏదో పనిమీద పట్నం వెళ్ళాడు తను. తిరిగొచ్చేసరికి వూరంతా మారిపోయినట్టుగా కన్పించింది. వూళ్ళో సగంపైగా ఇళ్ళు కూలిపోయాయి. చెట్లన్నీ కూలిపోయాయి. వూరంత చిందరవందరగా వుంది

బసవమ్మ కూలిపోయిన ఇంటిముందు కూర్చుని ఏడుస్తూ వుంది

దానిబాధ ఇల్లు కూలిపోయినందుకు కాదు ... ఆ తుఫానులో తనెక్కడ చిక్కుకుపోయానో అని శోకాలు పెడుతూ వుంది ఆమె. క్షేమంగా వున్నందుకు తనెంతో సంతోషించేడు.

ఇల్లు కూలిపోయినప్పుడు యింట్లోనే వుందట ఆమె. మంచం వేసుకున్న వైపు వున్న గోడే మాత్రం కూలిపోలేదు. కూలిపోయిన యింటికప్పు నుండి బసవమ్మను ఆ గోడే రక్షించింది. వూళ్ళో వాళ్ళంతా ఆమె చచ్చిపోయుందనే అనుకున్నారట. తీరా తాటాకులు, వాసాలు తీసి చూస్తే లోపల గోడపక్కనే సురక్షితంగా వున్న బసవమ్మను చూసి ముక్కుమీద వేలేసుకున్నారు అందరూ ...

... వారం రోజులు అదో అద్భుతంగా చెప్పుకున్నారందరూ ...

ఎవరో తలుపు కొట్టడంతో తలచుట్టూ ముసిరిన ఆలోచనల్ని పక్కకునెట్టేసి, తలుపు తీశాడు

ఎదురుగా రాఘవులు కన్పించేడు వర్షంలో పూర్తిగా తడిసిపోయి.

"గౌరమ్మని తీసుకురాలేదురా?" ఆత్రంగా అడిగేడు బలరామయ్య

"వాళ్ళు వచ్చారు ... అదిగో ఆ చెట్టు కింద నిలబడ్డారు అమ్మాయి, అల్లుడూనూ"

చెట్టు కింద గౌరమ్మకి అంటుకుపోయి నిలబడ్డ ఆమె భర్త కన్పించేడు.

బలరామయ్య పెదాల పై చిరునవ్వు మెరిసింది. మెదడులో కూడ మరుపు మడతల్లో పడిన వో దృశ్యం బయటకొచ్చి "సాట్‌లైట్"లా మెరిసింది

బసవమ్మ, తనూ వేరుశనక్కాయలు పీకడానికి పొలం వెళ్ళారు. జోరున వాన కురుస్తుంటే మర్రిచెట్టు కింద చేరారు

చుట్టుపక్కల ఎవరూ లేకపోవటం చూసి ఆమె భుజంపై చెయ్యి వేశాడు. చెట్టు మొదట్లో చేరి పడగ విప్పి తనవైపే చూస్తున్న త్రాచుపామును చూడగానే ఇద్దరికీ గుండెలవిసిపోయాయి

వొకటే పరుగు ఇద్దరూ!

"ఏమిటా ముసిముసి నవ్వులు ... పిల్లల్ని వానలోనే నిలబెడతారా? లోపలికి పిలవండి" అంది బసవమ్మ నుదుట కుంకుమ బొట్టు దిద్దుకుని, చేతో కుంకుమ భరిణె తెస్తూ.

హఠాత్తుగా ఎవరో నెట్టేసినట్టు పెద్దగా గాలి విసురుకు పడిపోబోయింది బసవమ్మ. చేతిలోని కుంకుమ బరిణె జారి కింద పడింది.

ఫెళ, ఫెళ చెట్టు విరిగిన చప్పుడు...

హఠాత్తుగా మీద పడబోతున్న పెద్ద చెట్టుకొమ్మని చూసి, గౌరిని పక్కకు నెట్టాడు ఆమె భర్త. తను కూడా ఆ చెట్టుకొమ్మ బారి నుంచి తప్పించుకుందామని కదిలేలోపే తలమీద పడింది

వాననీళ్ళలో కలుస్తున్న భర్త రక్తం చూసి స్పృహ తప్పి పడిపోయింది గౌరి. వాన చినుకులకి ఆమె నుదుటి బొట్టు చెరిగిపోయింది

బలరామయ్య స్థాణువులా నిలబడిపోయేడు.

... పెళ్ళయి ఆరేళ్ళు తిరక్కుముందే చనిపోయిన కోడలు... పెళ్ళయి ఆరోజులు తిరక్కుముందే పసుపు, కుంకుమలు కోల్పోయిన మనవరాలు... వూళ్ళో ఎందరికో కుంకుమబొట్టు దిద్దిన బసవమ్మ హస్తవాసి తనింట్లోనే పనికిరాలేదు... ప్చ్...

బసవమ్మ చేతి వేళ్ళు వొణుకుతూ కన్పించేయి మొట్టమొదటిసారిగా బలరామయ్యకి

# వారికి చాలినంత లభిస్తున్నదని మీరు గట్టిగా చెప్పగలరా?








"మా డాక్టరుగారు హార్లిక్స్‌ను సిఫారసు చేసినప్పటినుంచి మా కుటుంబమంతా రోజూ హార్లిక్స్ తీసుకునేట్టు అలవాటు చేశాను
మీరు కూడా మీ కుటుంబానికి హార్లిక్స్ ఇస్తున్నారా?"

చాలా మంది తల్లులు తమ తమ ఆహార పదార్థాలలో ఆరోగ్యానికి ఏవి మంచివో అవి చాలినంత లభిస్తుందో లేదో స్పష్టంగా చెప్పలేరు

అందుచేతనే వారు హార్లిక్స్‌ను నమ్ముకున్నారు

హార్లిక్స్ రోజూ క్రమం తప్పకుండా తీసుకున్నట్టయితే మీ కుటుంబానికి పుష్టికరమైన సంపూర్ణ ఆరోగ్యం చేకూరుతుంది

ఎందుచేతనంటే, చిక్కటి పాలు, మాల్టెడ్ బార్లీ గోధుమ పుష్కలంగా హార్లిక్స్‌లో ఉన్నాయి అవే ప్రధాన పోషకాహారానికి మూలం

హార్లిక్స్‌ను నిత్యం తీసుకోవటం ఎంతో మంచిది మీ మనసులోని అన్ని చింతలూ తొలగిస్తుంది

# హార్లిక్స్-మంచి పుష్టికరమైనది




(గత సంచిక తరువాయి)

వెంకటరత్నం ఇంట్లోకి వచ్చేసరికి ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది లోపలకు వచ్చి వరండా తలుపులు దగ్గరకు వేసాడు గది గడప దగ్గరకు వచ్చి లోపలకు తొంగిచూసాడు లోపల మంచంపై బోర్లా పడుకుని కాళ్ళు ఊపుతూ లాంతరు వెలుగులో ఏమిటో చదువుతోంది

లోపలకు వచ్చాడు

నుదుటిపైన పాపిడి దగ్గరగా ఉండే చిన్ని వెంట్రుకలను ఎడమచేతితో ప్రక్కకు నెట్టుకుంటూ ఎంతో శ్రద్ధగా చదువుతూన్న తార ఎవరో గదిలోకి వచ్చినట్లుగా అన్పించి చటుక్కున తల ఎత్తింది

ఎదురుగా వెంకటరత్నం!

అతడి కళ్ళల్లో వింతమెరుపు!

ఇంతకు మునుపెన్నడూ కనిపించని ఉద్విగ్నత!

లేచి చీరె సరిచేసుకుంటూ "ఎపుడొచ్చారు?" అడిగింది

మంచంపై కూర్చుని భార్యను ఒడిలోకి లాక్కుని బుగ్గపై గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు

"ఏమిటీ! ఇంట్లోనివాళ్ళంతా బందరు సముద్ర స్నానానికి వెళ్ళారా?"

ముద్దుగా నవ్వింది తార

"అత్తయ్య అంగలూరు వెళ్ళారు, వాళ్ళ అమ్మగార్ని చూచేందుకు"

వెంకటరత్నానికి చటుక్కున మామగారి విషయం గుర్తుకొచ్చింది

సంచీలోంచి పండ్లు తీసి భార్య వడిలో పెట్టాడు పెళ్ళైన ఇన్ని సంవత్సరాలలోనూ తనకోసంగా ఇంటికొస్తూ వెంకటరత్నం తీసుకొచ్చిన మొట్టమొదటి కానుక!

ఎందుకో తెలియకుండానే తారకు కళ్ళు చెమర్చాయి మనసులో గమ్మత్తయిన భావాలు గబగబా పరుగులు తీసాయి! కళ్ళెత్తి భర్త ముఖంలోకి చూసింది ఆ ముఖంలో, ఆ కళ్ళల్లో, పెదవుల చివర్ల చిందులేస్తూన్న చిరునవ్వు తార ఒడలంతా ఆప్యాయంగా స్పృశించింది ఇంకా తన ఒడిలోనే ఉన్న వెంకట్ చేతిని సుతారంగా పైకెత్తి పెదవులకు ఆనించుకుంది

"ఇవి ఎవరికోసం తెచ్చారు?" గుసగుసగా ప్రశ్నించింది

"నేను తేలేదు తార తల్లికోసం సంపించారు"

వెంకట్ చేతిని పట్టుకుని ఉన్న తార చేయి గబుక్కున బిగుసుకుంది ఆ కళ్ళల్లో సూటిగా నిలిచిపోయిన ప్రశ్న పెదవులు దాటకుండానే వెంకట్‌కు అర్థమైపోయింది

నిండుగా నవ్వుతూ 'అవును' అన్నట్లుగా తల ఊపాడు

"నిజంగా? ఎక్కడ?" భర్త భుజాలుపట్టి ఊపుతూ అడిగింది

ఆ అడగటంలోని తొందరకూ, ఆవేశానికి కించిత్ ఆశ్చర్యపోయాడు వెంకటరత్నం

రాఘవయ్యగారు కనిపించిన సంగతంతా చెప్పి "రెండు మూడు రోజుల్లో వస్తానన్నారు" అనికూడా చెప్పాడు

తారకు చాలా సంతోష మనిపించింది

**జరిగిన కథ — 8** రాఘవయ్య, నాగరత్నం దంపతులకు తార, సరళ—రామారావ్, రామ్మోహన్, చంద్రం సంతానం కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం శ్రీనివాసరావ్‌తో కలసి ప్రసాద్ పెళ్ళికి వెళ్ళిన వెంకటరత్నం మదిలో 'అనుకోని సంఘటన' ద్వారా ముద్రవేసుకొంటుంది తార ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకొంటుంది తార భర్తపైన ఉండే గౌరవంకొద్దీ అతను పంపే ఉత్తరాలతోపాటు పార్టీ పుస్తకాలు కూడా చదువుతూ ఆనాటి రాజకీయాలను అవగతం చేసుకొంటుంది తార బెజవాడలో జరగబోతున్న మీటింగులకి వెళ్దాం రమ్మని తారకు ఉత్తరం ద్వారా తెల్పుతాడు వెంకటరత్నం తండ్రి వెళ్ళొద్దని వారించినా వినక ఎన్నో బాధలకోర్చి అతన్ని కలుసుకొంది తార రాఘవయ్య నిరాదరణతో వెంకట్ వెంట వచ్చిన తార అత్తగారింటి పరిస్థితుల్ని అవగాహన చేసుకుంటుంది అలుడి ద్వారా తార గర్భవతి అని తెలుసుకొన్న రాఘవయ్యగారు పరమానందభరితులై, రెండు మూడు రోజుల్లో వచ్చి చూస్తానని చెబుతారు

వెంకటరత్నం మెడను గట్టిగా కౌగలించుకుని అతని బుగ్గపై ముద్దు పెట్టుకున్నాది అంతలోనే అతని ఎదపైకి వాలిపోయి వెక్కి వెక్కి ఏడ్చేసింది అలా ఏడుస్తూన్న భార్యను పొదివి పట్టుకున్నాడు వెంకట్ ఆమె వీపుపైన ఆప్యాయంగా తడుతూ అనుకున్నాడు — 'ఇన్నాళ్ళూ ఈ చిట్టి గుండెల్లో ఇంతటి అగ్నిగుండం దాగి ఉన్నాది కాబోలు!'

తార శాంతించాక సరిగ్గా కూర్చోబెడుతూ అన్నాడు — "ఇదిగో ఈ ద్రాక్ష కడుక్కురా"

"అబ్బ! ఇపుడొద్దండీ తర్వాత తింటాను" ముఖం చిట్లించింది తార

"నీకోసం కాదు తారా, నాకోసం"

"అరే! మీకా! ఉండండి ఇపుడే తెస్తాను" తామరాకులో చుట్టి ఉన్న ద్రాక్ష తీసుకుని వంట గదివైపు పరుగెత్తింది

వెంకటరత్నం లేచి స్నానానికి వెళ్ళాడు లుంగీ కట్టుకుంటూండగా ఒక ప్లేట్లో ద్రాక్షపండ్లూ, మరో ప్లేట్లో నువ్వు పూర్ణాలూ పెట్టి తీసుకొచ్చింది తార వెంకటరత్నానికి నువ్వు పూర్ణాలంటే చాలా ఇష్టం! అందుకే చేసారు కాని, అతడికి అవి తినే తీరికేది?

అసలు ఇంట్లో ఏ పిండివంట చేయబోయినా ముందు 'ఇది అబ్బాయి కిష్టం' అనే మొదలు పెడుతుంది సత్యవతి పిల్లలు ఇంట్లో ఉంటే ఆ నోటికి ఖాళీ ఉండదు! పైగా ఎపుడూ ఎవరో ఒకరు వచ్చిపోయే ఇల్లు! ఏది చేసినా ఎక్కువే చేస్తుంది సత్యవతి అయినాకూడా పట్టుమని పది రోజులు కూడా ఏ ఫలహారమూ ఉండేదికాదు ఒకటి అవ్వంగానే మరొక రకం చేసి ఉంచుతుంది ఎన్ని చేసినా తినే తీరిక మాత్రం వెంకట్‌కు ఉండదు అయినాకూడా చేసేముందు మాత్రం 'ఇది అబ్బాయి కిష్టం' అంటూనే చేస్తుంది సత్యవతమ్మ

చాలా రోజుల తర్వాత ఇవ్వాళే కాస్త తీరిగ్గా కన్పించాడు ప్లేట్లు రెండూ స్టూలుమీద పెట్టి లాంతరు దగ్గరగా ఉంచింది మంచినీళ్ళుకూడా తెచ్చిపెట్టింది

"ఊఁ తిను" అన్నాడు వెంకట్, ద్రాక్ష తీసి నోటికందిస్తూ

వారించబోయింది తార

ఎడంచేత్తో తార చెవిపట్టి "ఊఁ తెరువు నోరు" అంటూ మందలించాడు

ఆ మందలింపులో మిళితమై ఉన్న ఆప్యాయతకు పులకించింది తార హృదయం!

నువ్వుపూర్ణాన్ని ఎత్తి నోట్లో పెట్టుకోబోతూ అన్నాడు — "ఇపుడు ఇవి తింటే భోజనం చేయగలనా!"

"కాస్త ఆలస్యంగా భోంచేద్దురుగానిలెండి"

అతను తీపి తిన్నాక ఏదయినా కాస్త కారం కావాలంటాడు ఇంట్లో కారపు ఫలహారం ఏదీ లేకపోతే ఆవకాయముక్క అయినా తింటాడు అందువలన కొంచెం పకోడీలు తెచ్చేటందుకు మంచం మధ్యలో బాసింపట్టు వేసుకుని కూర్చున్న తార గబుక్కున క్రిందకు దూకినట్లుగా దిగింది

"ఏయ్! ఇలా రా!" అన్నాడు

''ఇదిగో - ఇపుడే వచ్చేస్తున్నాను'' వంట గదిలోకెళ్ళి గబగబా పకోడీలు తెచ్చింది

''నీకసలు బుద్ధి ఉందా?'' కాస్త కోపంగా అన్నాడు వెంకట్

తెల్లబోయింది తార ఏం తప్పు చేస్తున్నానా అని ఆశ్చర్యంగా చూస్తున్నాది

''ఏమిటా గెంతటం! ఇందాక నే వచ్చినపుడు కూడా నీవు బోర్లా పడుకుని ఉన్నావు అలా చేస్తే-లోపలి బేబీకి దెబ్బకాదూ'' అన్నాడు వెంకట్

''అబ్బో! ఇదా! నేనింకేమిటో అనుకున్నాను'' అంటూ కిలకిలా నవ్వింది

''ఒదినా ఒదినా'' దమయంతి గొంతుక విని ''అత్తయ్యొచ్చినట్టున్నారు'' అంటూ నే చురుగ్గా లేచివెళ్ళింది

తలుపుతీస్తూ దమయంతితో అన్నది —''నువ్వు అమ్మ దగ్గరకు వెళ్ళి ఉంటావని అనుకోలేదు! ఏమిటింకా రాలేదు అని ఎదురుచూస్తున్నాను''

* * *

మూడు రోజుల తర్వాత --

మధ్యాహ్నం పూట తార బియ్యపుచేట ముందర పెట్టుకుని ఏరుతున్నాది

ఇదివరకైతే బియ్యం చేటలో పోసి శుభ్రంగా చెరిగి పాలేరు చేతికిచ్చేది ''ఇవి కాస్త ఏరిపెట్టరా రంగా'' అనేది వాడికి తార అంటే చెప్పలేని ఇష్టం! తార ఎపుడు ఏ పని చెబుతుందా అని సీతమ్మ ముందర హనుమంతుడిలా ఎదురు చూస్తుంటాడు కాని, ఇపుడు ఆ బియ్యంలోని వడ్లగడ్డలు తారకు చాల రుచికరంగా ఉంటున్నాయి! అందువల్ల రంగడు అడిగినా ''నాకేం పనిలేదు రంగా అందుకని నేనే శుభ్రం చేస్తున్నాను'' అనేదే కానీ బియ్యం ఏరే పని మాత్రం వాడికివ్వటంలేదు

వెనుక వరండాలో కూర్చుని పుట్టబోయే పాపని ఊహించుకుంటూ, బియ్యంలోని వడ్లగడ్డలు తింటూన్న తార కళ్యాణి కేకలకు ఉలిక్కిపడింది

''ఒదినా ఒదినా'' అరుస్తూనే దగ్గరకు వచ్చింది తార భుజాలమీద చేయివేసి అన్నది - ''మీ అమ్మ వచ్చింది''

''మా అమ్మా?'' ఆశ్చర్యంగా అడిగింది అలా అడుగుతూన్న తారకు మొన్న వెంకటరత్నం చెప్పిన విషయం చప్పున జ్ఞాపకానికి వచ్చింది

చేట తీసి బియ్యంపెట్టెపైన పెట్టి, చేతులు కడుక్కుని తుడుచుకుంటూ వచ్చింది తార వచ్చేసరికి వచ్చిన అతిధులు కాళ్ళు కడుక్కోవటమూ, తుడుచుకోవటమూ కూడా అయిపోయి మంచినీళ్ళు త్రాగుతున్నారు హాల్లో చాప పరుస్తూన్నది కళ్యాణి గడపలోకి వచ్చిన తార తల్లిప్రక్కన ఉన్న మరో వ్యక్తిని చప్పున గుర్తు పట్టలేకపోయింది ఆశ్చర్యంగా, ఆలోచనగా చూస్తూన్న తార కళ్ళల్లోని సందేహాన్ని సరిగ్గా గ్రహించిన దానిలాగా నవ్వుతూ చెప్పింది — ''నేను జయమ్మను తారా, గుర్తుపట్ట లేదా? మర్చిపోయావా?''

చటుక్కున గుర్తుకొచ్చింది తారకు 'ఆవిడ ప్రసాద్ భార్య' అని ఆ మరుపును పైకి కన్పించ



నియకుండా గడుసుగా నవ్వింది కాని, 'వీళ్ళు ఎప్పుడు, ఎలా కలుసుకున్నారా' అని మనసులో ఆశ్చర్యంగానే ఉన్నది

కొంచెంసేపు నియ్యపురాళ్ళిద్దరూ చమత్కారంగా ఎత్తిపొడుచుకున్నారు! బయటపడకుండా దెప్పుకున్నారు! నవ్వుతూనే పోట్లాడుకున్నారు! సోపాన్ని కన్పించనీయకుండా ఒకరి యోగక్షేమాలు మరొకరు చెప్పుకున్నారు!

''పది రోజులపాటు అమ్మాయిని తీసుకెళ్ళి, మళ్ళీ పంపిస్తాము'' అని మర్యాదగా అడిగింది నాగరత్నం

''అయ్యో! దానికేం భాగ్యం! మూడేళ్ళకు దాని పుట్టింటివారు వచ్చి అడిగితే కాదని ఎట్లా అంటాను అలాగే తీసుకెళ్ళండి'' మెత్తని కొరడాతో ఛెళ్ళున కొట్టినట్లుగా ఉలిక్కిపడ్డారు తార, నాగరత్నమ్మానూ చిన్నబుచ్చుకున్నాది తార మనస్సు ఘాటుగా సమాధానం చెప్పబోయిని నాగరత్నమ్మ తార కళ్ళల్లోని వారింపునూ, జయమ్మ మోచేతి పొడుపులోని అర్థాన్నీ గ్రహించినదానిలా ఆగిపోయింది

ఇంట్లో ఉన్న పిండివంటలూ, కాఫీలతో మర్యాదకేమీ లోపం చేయలేదు సత్యవతమ్మ

గర్భవతిగా ఉన్న కూతురి కోసం చేసి తెచ్చిన ఫలహారాలు తీసి బయటపెట్టి, సంచి మడతలు పెట్టి ప్రక్కన పెట్టుకున్నాది నాగరత్నం జయమ్మ తారకు దగ్గరగా వచ్చి రహస్యం చెప్పినట్లుగా అన్నది— ''ఈ సమయంలో ఎవరిని ఎక్కువగా చూస్తే అలాటి పిల్లలే పుడతారట అందుకే నీకీ పుత్తడి బొమ్మను తెచ్చాను'' చేతిలోని కాలెండరు విప్పి చూపింది

నిజంగానే పుత్తడిబొమ్మ! ప్రపంచంలోని అందమంతా కలిపి రంగరించి చేసిన అద్భుతమైన అపురూపమైన సౌందర్యం!

ఎంతో ముద్దుగా ఉన్నది! భద్రంగా అందుకున్నాది తార!

* * *

1945లో రెండవ ప్రపంచ యుద్ధం ముగిసాక ధరలు ఆకాశాన్ని అంటుతున్నాయి! సామాన్య ప్రజానీకపు పరిస్థితి గగ్గోలుగా ఉన్నది పిండివంటలతో భోజనం చేయలేకపోయినా, కనీసం కడుపు నింపుకోవటానికీ, పనిచేసేందుకు తగిన శక్తిని పొందేటందుకయినా తినాలికదా! రంగురంగుల రకరకాల బట్టలతో సింగారించుకోలేక పోయినా ఒళ్ళు దాచుకునేందుకు బట్ట కావాలి!

నీటికికూడా అల్లల్లాడిపోతున్నాది మధ్యతరగతి జనం! వీళ్ళకోసంగానే దేశంలో అక్కడక్కడా రేషను షాపులు తెరిచారు! నూజెళ్ళకు ప్రక్క గ్రామం 'చిరివింతల'లో కూడా రేషను కొట్టు పెట్టారు దానికి డీలర్‌గా వెంకట్‌ను నియమించారు

అసలే ఆవేశపరుడయిన వెంకటరత్నం ఈ పరిణామానికి మరింత జ్వాలలా చెలరేగుతున్నాడు

పైగా దేశంలో ఒకవైపునుంచీ దరిద్రం ఎంత ఎక్కువగా చుట్టుకువస్తున్నాదో — మరోవైపున ధనమదాంధుల అహంకారం అంత ఎక్కువగా పెరిగిపోతున్నాది! అయస్కాంతం ఇనుమును మాత్రమే

# తార

ఆకర్షించినట్లుగా డబ్బును డబ్బే ఆకర్షిస్తుంది కాబోలు! డబ్బులున్నవాళ్ళకే ఇంకా ఇంకా మూటల కొద్దీ డబ్బు వచ్చిపడుతూనే ఉంటుంది! మేడపైన మేడ కడుతూనే ఉంటాడు! దరిద్రుడు ఇంకా ఇంకా అడుగంటుతూనే ఉన్నాడు!

ఈ పరిస్థితిని చూస్తుంటే వెంకటరత్నం ఒంట్లోని రక్తం మరిగి ఆవిర్లు కక్కుతున్నాది

ఫలితంగానే అతను ఇంకా ఇంకా కమ్యూనిస్టు పార్టీలో కూరుకుపోతున్నాడు అతని ఊపిరి, అతని ప్రాణం, అతని జీవితం, అతని లక్ష్యం, అతని ధ్యేయం — అన్నీ ఆ ఎర్ర జెండానే!!

గవర్నమెంటు ఇచ్చే బియ్యం, దుప్పట్లూ, బట్టలూ వెంకటరత్నం చేతిలోంచి పేదలకు చాలామట్టుకు ఉచితంగానే సరఫరా అయిపోయేవి

''బాబ్బాబూ! ముసిలోడి పానం ఉసూరుమంటున్నాది బాబూ! పిల్లకూనలు కళ్ళల్లో పానాలెట్టుక్కూకున్నారు బాబూ'' అంటే చాలు — ఇహ వాళ్ళదగ్గిర పైసా కూడా అడగడు వాళ్ళు ''ఊఁ'' అనేవరకూ కొలిచి, వాళ్ళ సంచులు నింపి పంపేవాడు

లేబర్ దృష్టిలో వెంకటరత్నం దేవుడు!

* * *

తారకు ఐదవ మాసం జరుగుతున్నాది తార లేవలేని స్థితిలో ఉన్నాకూడా ఇంట్లోని మనుష్యుల్లో ఏమాత్రం మార్పు వచ్చేదికాదు అందుకు తారకూడా వెంకటరత్నంతో ఏనాడూ ఆ విషయం పైన ఫిర్యాదులాంటిదేమీ చేయలేదు

అయితే — ఈ మధ్య తారకు ఒక విధమైన బెంగలాంటిది మనసులో చోటు చేసుకున్నాది ఆనాడు జయ వచ్చి వెళ్తూ వెళ్తూ ''ఈ సమయంలో ఎవర్నైతే ఎక్కువగా చూస్తుంటావో అలాంటి పాపే పుడుతుంది'' అని చెప్పిన మాటలు కనీసం రోజుకో ఇరవైసార్లయినా గుర్తుకొస్తుంటాయి! గుర్తుకొచ్చినపుడల్లా మొదట్లో అయితే తృప్తిగా, సిగ్గుగా మనోహరమైన చిరునవ్వొకటి పెదవులమీద అందంగా నర్తించుతుండేది! కళ్ళను బరువుగా ఎత్తి అరమోడ్పు కన్నులతో పరవశంగా కాలెండరులోని అందాల అపరంజి బొమ్మను చూస్తుండేది కాని, తర్వాత తర్వాత తారకు ఒక అనుమానం రావటం ప్రారంభించింది ఆ చిన్న అనుమానమే పెనుభూతమై ఆమెని కలవరపెడుతున్నాది ఆమెని అంతగా పట్టి పీడిస్తున్న ఆ సమస్య ఏమిటంటే — 'తను కాలెండరులోని ముద్దులు మూటకడుతున్న ఆ చిన్నారిని కంటే, పెద్ద ఆడపడుచు గిరిజనే ఎక్కువగా చూస్తున్నానేమో' అనే అనుమానం సడెన్‌గావచ్చి వరదలా ఆమెని ముంచేసింది

'అవును! రోజులో ఎక్కువ భాగం గిరిజనే చూస్తున్నాను ఆమెలాంటి పాపాయే పుడితే' వెన్నెముక పొడుపునా భయం లాంటిది జరజరా పాకి ఒడలంతా జలదరించింది వేదు విషం లాంటి ఆ భావన ఆమెని స్థిమితంగా ఉండనీయటంలేదు

అప్పట్నుండీ ఇంట్లోని పని గబగబా చేసేసి గదిలోకి వెళ్ళి పడుకునేది లేదా ఏదో ఒకటి కుడుతూనో, అల్లుతూనో గడిపేది ఏదైనా ఎక్కువసేపు తన గదిలోనే ఉండిపోతున్నాది

సత్యవతమ్మ నోటికి గొప్ప అవకాశం! గిరిజ ఎత్తిపొడుపు మాటలుకానీ, సత్యవతమ్మ సాధింపులు కానీ తారను ఏమీ చేయలేకపోయాయి! తారకు అవన్నీ బాగా అలవాటయిపోయాయి!

వెంకటరత్నం రేషను షాపులో చేస్తున్న దానధర్మాలు వెంకట్రామయ్యగారికి చూచాయగా తెలుస్తూనే ఉన్నాయి! సత్యవతమ్మ బెదిరింపునీ ఖాతరు చెయ్యకుండా 'పురి'లో నిల్వచేసిన వడ్లుని రెండుసార్లు పట్టించుకువెళ్ళిన విషయం కూడా ఆయన నోటీసుకు అందింది పైగా సత్యవతమ్మ కోడలిపైన కోపం, కొడుకుపైన కోపం ఎలా చూపాలో తెలియక భర్త దగ్గర ముక్కు చీదుతూ ఫిర్యాదులు చేసేది అవి వింటూంటే ఆయనకు ఒళ్ళు మండేది! అసలే ఆయనకు చిరాకు ఎక్కువ! పైగా సత్యవతమ్మ ఏడుస్తూ చెప్పేమాటలు వినాలంటే ఇంకా చిరాకు పడిపోయేవారు!

అందునా సత్యవతమ్మకో చెడ్డ అలవాటు! ఆయనకు అన్నంపెట్టి, కూరవేసి, కలుపుకుంటూన్న అన్నంలో వెయ్యివేసి, గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చిపెట్టి, పీట వేసుక్కూర్చుని తీరిగ్గా రామాయణం విప్పేది! అప్పటికి ఆయన ఆరో ముద్దో, ఏడో ముద్దో నోటికి అందించబోతూ ఉంటారు అంతే! పరువు కోపం వచ్చేదాయనకు ఒకసారి తింటూన్న కంచంలోనే చేయి కడిగేసి వెళ్ళిపోయారు

''అయ్యో! నిండు కంచంలో నీళ్ళు పోసుకుంటారా ఎవరైనా! ఆడదిమనిషి — అడవి తనమూనా! ఆకలి లేకపోతే ముందరే చెప్పొచ్చుగా'' అని విసుక్కునేదేగానీ, తను చేసిన తప్పుకే ఆయన అలా శిక్ష వేసుకున్నారు అని ఆవిడకు తెలిసేదికాదు! ఆయనా చెప్పేవారు కారు!

## కేన్సరు – ఆత్మవిశ్వాసం

ఆత్మ విశ్వాసం లేనివారిలో కేన్సరు ప్రబలంగా వున్నట్లు పశ్చిమ జర్మనీ కేన్సరు స్పెషలిస్టు ప్రొ మేరియా తెలియచేశారు ఇటీవల పశ్చిమ జర్మనీలో ఒక సమావేశంలో కేన్సరుకు రోగి, మనస్తత్వానికి గల సంబంధాన్ని గురించి మాట్లాడుతూ ఈ విధంగా తెలియచేశారు అంతేగాక, పొగత్రాగటానికి, ఊపిరితిత్తుల కేన్సరుకు సంబంధం వుండక పోవచ్చుననే అభిప్రాయాన్ని కూడా ఆమె వ్యక్తంచేశారు ఆమె జరిపిన పరిశోధనలో పొగ త్రాగేవారికి పొగ త్రాగనివారికంటె ముందుగా కేన్సరు ఏర్పడటంలేదని తేలింది అయితే పొగ త్రాగనివారికి కేన్సరు భయం లేదని భావిస్తూ సమగ్రంగా పరీక్షించడం లేదని అందువలన పై అభిప్రాయం ఏర్పడి వుండవచ్చునని ఆమె అన్నారు అయినా ఆమె జరిపిన పరిశోధనల్లో పొగ త్రాగని వారిలో 62 శాతం మందికి కేన్సరు వుండగా, పొగ త్రాగేవారిలో 90 శాతం మందికి కేన్సరు వున్నట్లు తేలింది

# హైదరాబాదు నోట్‌బుక్

**సోదరి శ్రీమతి గోదావరమ్మ !**

భారతీయ ధర్మశాస్త్రకారులు మహిళలకు ఇచ్చిన స్థానం అత్యున్నతం, అసదృశం. ఈ స్థానం వారికి పురుషుల దయాధర్మ భిక్షతో వచ్చింది కాదు. వారి సమర్థతవల్ల, సేవాప్రదర్శం వల్ల, తల్లి మనసు వల్ల సంపాదించుకొన్నది. ఈ నాడు కూడా అలనాటి ధర్మశాస్త్రకారుల వాక్కులను సార్థకం చేసి, మహిళల స్థానాన్ని మహోజ్జ్వలం చేస్తున్న మహిళలు గ్రామసీమలలో ఎలాటి ప్రచారాభిలాష లేక తమ సేవాధర్మాన్ని నిర్వర్తిస్తూ ఇతరులకు ఆదర్శంగా ప్రవర్తిస్తున్నారంటే ఆశ్చర్య పడవలసిన అవసరం లేదు. ఆనంద పడాలి అలాటి వారిలో ఒకరు సోదరి శ్రీమతి గోదావరమ్మ. ఇటీవల ఈమెను ఈమె భర్త శ్రీ పెంచలి నరసింహమూర్తిని కలుసుకొన్నప్పుడు సచ్ఛీలురైన నేటి యువతులు సంఘం పట్ల తమ ధర్మాన్ని ఎంతటి బాధ్యతతో నిర్వహించగలరో తెలిసి తన్మయుణ్ణయ్యాను. సోదరి గోదావరమ్మ వనపర్తి తాలూకా కొత్తకోట గ్రామ వాస్తవ్యురాలు. మూడు పదులు దాటిన వయస్సు. ఉన్నతవంశం, ఉత్తమ సంస్కారం, ముచ్చటగా ముగ్గురు పిల్లలు. సంఘసేవాభావం తొణికిసలాడే వ్యక్తిత్వం. కనుకనే ఈమె కొత్త కోటలో పెక్కు మహిళా సంస్థల కార్యకలాపాలను నిర్వహించగలుగుతున్నది.

తాలూకా కోఆపరేటివ్ సొసైటీ యాజమాన్యములో నడిచే సరోజినీ మహిళా సహకార సంస్థకు ఈమె గౌరవాధ్యక్ష. పేదలకుముఖ్యముగా సంఘంలో వెనుక బడిన మహిళలకు ఉపాధి కల్పించడం, ఈ సంస్థ లక్ష్యం. ఇంతవరకు 36 మంది మహిళలకు కులమతవివక్ష లేకుండా కుట్టు మిషన్లను పంచడం జరిగింది. విశ్వహిందూ పరిషత్తు శాఖ అయిన మాతృ మండలికి కూడ ఈమె అధ్యక్ష. సామూహిక కార్యక్రమాలు నిర్వహించడం ఈ మండలిలక్ష్యం. ప్రతి శనివారం స్త్రీ సంక్షేమ విషయమై చర్చలు, పండుగ దినాలలో సహభోజనాలు, ప్రముఖుల చేత ఉపన్యాసాలిప్పించడం, గీతా జయంతి వంటివి నిర్వహిస్తూ భారతీయ సంస్కృతిని ప్రచారం చేయడం, పురాణపఠనం, మున్నగు వాటితో జన జాగృతి కలిగించడం ఈ మండలి కార్యక్రమాలలో కొన్ని. ఇటీవల ఈ మండలి విశ్వహిందూ పరిషత్తు పాలమూరు (మహబూబ్ నగర్) జిల్లా శాఖ ధర్మపీఠాధిపతి చిన్మయానందస్వామి (ఏర్పేడు మళయాళ స్వామిశాఖ)తో వేదాంత ప్రసంగాలు ఏర్పాటు చేయడం జరిగింది. జిల్లా ఆరోగ్య శాఖాధికారులతో కలిసి గోదావరమ్మ కుటుంబ నియంత్రణ ప్రచారం కూడా చేసింది. ఇలా వివిధ సేవా కార్యక్రమాలలో నిమగ్నురాలు కావడం వల్లనే ఆమె కొత్తకోట పంచాయితీకి ఏకగ్రీవంగా ఎన్నిక కావడం గ్రామస్థులెవరికీ అబ్బురమనిపించ లేదు. గ్రామ చరిత్రలో నూతన చరిత్రగా భావించారు.

ఈ పదవి వల్ల ఆమె నిత్యావసర వస్తువుల పంపిణీలో బీదలకు అన్యాయం జరుగకుండా పాటుపడటం తనలక్ష్యంగా పెట్టుకొన్నది. ''అమ్మయ్యా చక్కెర ఇప్పించండి! అమ్మయ్యా గ్యాస్ స్టవ్ ఇప్పించండి'' అనే నినాదాలతో నిరంతరం ఆమె ఇల్లు ప్రతిధ్వనిస్తూంటుంది. భారతీయ సాంస్కృతిక, ఆర్థిక విద్యా వైజ్ఞానిక జీవన స్రవంతిలో మహిళలు సముచిత పాత్ర వహించడం నా ప్రధాన లక్ష్యం అంటుంది ఆమె. నిత్యావసర వస్తువులు సరిగా తమకు లభించినప్పుడే గ్రామీణుల దృష్టి సాంస్కృతిక కార్యక్రమం వైపు మరలుతుంది. కనుక నిత్యావసర వస్తువుల పంపిణీ విషయంలో అధికారులతో సహకరించడం ఇప్పుడు నా ప్రథమ కర్తవ్యం అన్నది ఆమె. గోదావరమ్మ భర్త కూడ పంచాయతీ సభ్యులే. జీవిక కోసం పెద్దగా పాటుపడవలసిన అవసరం లేని ఈ పెంచలి యువదంపతులకు సంఘ సేవా రంగంలో గొప్ప భవిష్యత్తు వుంది. సోదరి గోదావరమ్మ ప్రజాసేవలో వనపర్తి సంస్థానం మహాజీవాంకురాలు శ్రీమతి రాణీ శంకరమ్మను ప్రజలకు తలపింపజేయగలదని నా విశ్వాసం.

### మలుపు

బిగించిన పిడికిలిపై
నాలుగు ఎముకల మొనలు
భౌతికంగా అవే హిమాలయ శిఖరాలు
యాభై ఏళ్ల దాకా
భుజం వైపు నుంచి అధిరోహణ
ఎన్నో సమస్యల ఎగుడు దిగుడులు
నవ్వుల ఏడ్పుల నిమ్నోన్నతాలు,
ఆరోహణలోనే అమితానందం,
ఎప్పుడు ఎదురుతిరుగుతాయో—
జీవాణువులు,
అసలే సందేహము వుండదు !
అర్ధశతాబ్ది అనే సగం దారిలో
జీవితపు ఎవరెస్టు ఎక్కి
ఆరోగ్యం జెండా ఎగిరేసినా
అవరోహణలో తేలిపోయే కాళ్ళు
దిగజారే నిట్టూర్పుల నిశ్వాసలు
''వరీ''ల వ్యాలీల్లో కొట్టే పల్టీలు
అక్కడే కొందరికి జీవితపు మలుపు
మరికొందరికి మరింత రాజీపడిపోయి
కవిసపు విలువలను అమ్ముకునే
అధ్యాన్నపు టడవిలో తప్పిపోడం !

— నిఖిలేశ్వర్

**పొర్లుదండాల పార్థసారథి :**

ఏదో కోరికతో దైవాన్ని మొక్కుకొన్నవారు పొర్లు దండాలు పెట్టడం, గండాదీపాలు ఇవ్వడం మొదలయిన మొక్కులు చెల్లిస్తారు. ఈ పొర్లు దండాలు దేవాలయాల ప్రదక్షిణ మార్గములో గాని, ఇతరత్రా గాని సమతలంలో జరుగుతాయి. కాని హైదరాబాదు వాస్తవ్యులైన పార్థసారథి జనవరి 4వ తేదీన ఉదయం నగర ప్రాంతంలోని కాలాపహాడ్ పైనున్న వెంకటేశ్వర స్వామి దేవాలయం 350 మెట్లను పొర్లు దండాలతో ఎక్కి, పొర్లుదండాలతో దిగివచ్చారు. ఈ ప్రదర్శనంలో పైకి ఎక్కడానికి పది నిమిషాలు, దిగడానికి 30 నిమిషాలు కాలం పట్టింది. ఈ ప్రదర్శనం సాయంత్రం 5.00 గంటలకు జరిగింది. యువజన సేవా శాఖామంత్రి శ్రీ పి. జనార్ధనరెడ్డి శ్రీ పార్థసారథికి పూలదండవేసి ప్రదర్శనాన్ని ప్రారంభించారు. పొర్లు దండాలతో ఎక్కడం కన్నా దిగడం కష్టం—అన్నారు పార్థసారథి. ఈయనకు పాముల పార్థసారథి అని కూడా పేరు ఈయన పాములతోనే సహజీవనం జరుపుతారు. ఈయనకు రకరకాల పాములు 323 సార్లు కాటు వేశాయి. అయినా గరళకంఠునిలాగ ఈయన మృత్యుంజయుడు. ఈయనకు 42 రకాల విద్యలు వచ్చు. వాటిలో వెనక్కు నడవడం ఒక్కటి, మోకాళ్లపై నడవడం మరొక్కటి. ఈయన కోయంబత్తూరులో 15 కిలోమీటర్ల మోకాళ్లపై గంటంపావులో వెనక్కు నడిచాడు ఒకే సారి 114సిగరెట్లనుతాగి ప్రపంచ రికార్డు స్థాపించారు డిసెంబర్ 27న ఈయన చార్మినార్ నుంచి అఫ్జల్‌గంజ్, మొజంజాహీ మార్కెట్, నాంపల్లి, టాంక్‌బండ్, కింగ్స్‌వే, సికిందరాబాద్ రైల్వే స్టేషన్, ముషీరాబాద్, చిక్కడపల్లి, గౌలిగూడా మీదుగా 25 కిలోమీటర్లు వెనక్కు నడిచి మరల చార్‌మినార్ చేరుకొని నగరవాసులను ఆశ్చర్యచకితులను చేశారు.

**కంటిలో కృత్రిమ కటక ఖచనం :**

కంటి పొర తొలగించిన పిదప కళ్లజోడు అవసరం లేక కనుగుడ్డులో కృత్రిమ కటకం అమర్చడం (ఇంట్రా ఆక్యులర్ లెన్స్ ఇన్‌ప్లాంటింగు) ద్వారా చూపు తెప్పించడం విషయమై జనవరి 3, 4, 5 తేదీలలో సరోజినీ కంటి ఆస్పత్రిలో జరిగిన కార్యగోష్ఠిలో (వర్క్

**వనితలకు మనవి**

కొత్తరకం వంటలు
క్లుప్తంగా రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలవుతుంది. —సం.

## హైదరాబాదు నోట్ బుక్

...ఫిలలో) అమెరికా, ఇంగ్లాండ్, జపాన్, కెనడా మున్నగు ఏడేసు నేత్ర వైద్యులు, దేశీయ నేత్ర వైద్యులతో సహా 200 మంది పాల్గొన్నారు. ఇలాంటి కార్యగోష్ఠి జరుగడం ప్రపంచంలో ఇదే తొలిసారి. నగరంలోని శ్రీరామ కృష్ణమఠం అధ్యక్షులు శ్రీ రంగనాథానంద ఈ కార్యగోష్ఠిని ప్రారంభిస్తూ, ప్రజల బాధా నివారణే విజ్ఞాన శాస్త్ర లక్ష్యం కావాలని ప్రబోధించారు. విజ్ఞాన శాస్త్రం సత్యాన్వేషణ వల్ల అభివృద్ధి చెందిందని విజ్ఞానశాస్త్రంతో పాటు ఆత్మదృష్టి కూడా పెరగాలని ఆయన కోరారు. ఈ కార్యగోష్ఠి వల్ల భారతీయ నేత్ర వైద్యులకు విదేశీ నేత్ర నిపుణుల జ్ఞానానుభవాలు పంచుకొని దేశ ప్రజలకు సేవ చేసే అవకాశం లభించిందని ఆయన అన్నారు. ప్రారంభ సమావేశానికి అధ్యక్షత వహించిన ఆరోగ్య శాఖా మంత్రి శ్రీ మదన్ మోహన్ తమ ప్రసంగంలో దేశంలో కృత్రిమ కటకాల ఉత్పత్తి జరుగుతుండటం వల్ల కంటిలో కృత్రిమకటక ఖచిత చికిత్సకు ఎక్కువ అవకాశాలు ఉన్నవని, దీనికి రాష్ట్ర ప్రభుత్వం తగిన సౌకర్యాలు కలిగిస్తుందని అన్నారు. 68 లక్షల వ్యయంతో విశాఖపట్టణంలో ప్రాంతీయ నేత్ర వైద్యశాలను నెలకొల్పదలచామని ప్రకటించారు. ఈ కార్యగోష్ఠి భారతీయ శాఖ అధ్యక్షుడు డాక్టర్ పి. శివారెడ్డి ప్రారంభంలో స్వాగతం చెబుతూ అమెరికాలో ఇటీవల విజయవంతంగా జరిగిన ఇంట్రా ఆక్యులర్ లెన్స్ ఇంప్లాంటేషన్ శస్త్రచికిత్సలు ప్రపంచమంతటా ఆసక్తి కలిగించాయన్నారు. నేత్ర వైద్య నిపుణులకోసం ఏర్పాటు చేసిన డాక్టర్ శివారెడ్డి బంగారు పతాకాన్ని స్వామి శ్రీ రంగనాథానంద డాక్టర్ మైల్స్ ఎంగాలిస్‌కు (అమెరికా) బహూకరించారు.

**ఉపశ్రుతి ::**

ఎంత చదువుకున్నా సంస్కారం కలుగడం లేదే చాలమందికి? అనడిగారొక విద్యావేత్త. అయ్యా, చెబితే వచ్చేది చదువు, చదువుకున్నా అబ్బేది సంస్కారం అన్నారు మిత్రులు శ్రీ ఎస్. పి. శేషాచార్యులు. (కవి, ఉపాధికల్పనా సంస్థలో అక్కౌంట్స్ ఆఫీసరు)

—తిరుమల రామచంద్ర

# వంటలు



## మైదా బర్ఫీ

కావలసిన పదార్థాలు: మైదా 250 గ్రా. పంచదార : 500 గ్రా, నెయ్యి లేక డాల్డా 250 గ్రా

తయారు చేయు విధానము :— మైదాను జల్లించి ఉంచుకోవలెను. నెయ్యి కొద్దిగా వెచ్చజేసి ఉంచుకోవలెను మూకుడు లేక గిన్నెలో పంచదారవేసి, కొద్దిగా నీరుచేర్చి పొయ్యిపై ఉంచి పాకము వేయవలెను పంచదార కొద్దిగా ముదురుపాకము (వేలుతో పట్టుకొని చూస్తే జిగురులా పట్టుకోవాలి) వచ్చేవరకు చేయవలెను. ముదురు పాకము వచ్చిన వెంటనే మైదాపిండివేసి కలుపుతుండవలెను వెంటనే సగం నెయ్యి వేయవలెను మైదాపిండి గడ్డలు కట్టకుండ కలపాలి. తర్వాత నెయ్యిపోస్తూ అడుగంటకుండ గరిటతో కలుపుతుండవలెను కొంచెంసేపటికి అది బురబురలాడుతూ ఉంటుంది (మైసూరు పాక్ వలె) ఆ సమయంలో దానిని దింపి నూనెరాసిన పళ్ళెములో వేయవలెను. అచ్చులా పోసి వేడిగా ఉన్నప్పుడే కత్తితో కోసి, సైజు చేసుకోవాలి చల్లారిన తర్వాత మనము కోసిన సైజులో ముక్కలను విడదీసుకోవచ్చు ఇవి నిలువ ఉంటాయి కాబట్టి డబ్బాలోపోసి ఉంచుకోవచ్చు మైదావేసిన వెంటనే సగం నెయ్యి వేసేయవలెను లేని పక్షంలో తర్వాత పిండి నెయ్యిని పీల్చుకోలేదు.

— షహనాజ్ బతుల్

## చక్రవాకాలు

కావలసిన సామాను, మైదా — పావు కిలో, పాల విరుగు — 1 కప్పు, చక్కెర — పావు కిలో, డాల్డా — 200 గ్రాములు.

తయారు చేయు విధానము : మైదాను జల్లించి పెట్టుకోవాలి మందపాటి గిన్నెలో రెండు పెద్ద చెమ్చాల డాల్డా వేసి బాగా కాగనిచ్చి దింపి దానిలో మైదా పోస్తూ బాగా కలపాలి కమ్మని వాసన వస్తుంది. ఈ వేగిన మైదాను ఒక పళ్ళెంలో పోసి పెట్టుకోవాలి.

అరలీటరు పాలను కాచి దానిలో రెండు చుక్కలు నిమ్మరసం వేస్తే పాలు విరిగిపోతాయి ఆ విరుగు పలుచని బట్టలో వడగడితే 1 కప్పు విరుగు అవుతుంది. ఈ విరుగుడును మైదాలో వేసి కలపాలి ఈ మిశ్రమాన్ని రెండు మూడు చుట్లుగా రోల్ చేసుకోవాలి. (చేగోడీ మాదిరి) అన్నీ అదేమాదిరి రోల్స్‌గా చేసుకుని పెట్టుకోవాలి.

చక్కెరలో కొంచెం నీరుపోసి తీగపాకం కన్నా మరి కొంత పాకం వచ్చేలా చూసి దింపి సెగ ప్రక్కగా పెట్టుకుని ఉంచుకోవాలి వనస్పతి వేడిచేసి దానిలో తయారుగా ఉంచుకున్న రోల్స్‌ను బంగారు రంగుగా వేయించుకుని ప్రక్కనే ఉన్న పాకంలో వేసి కొంచెంసేపు ఉంచి తీసి పెట్టుకోవాలి ఈ 'చక్రవాకాలు' పాకం పీల్చుకుని క్రిస్పీగా రుచిగా ఉంటాయి. వారంపాటు నిలవకూడా ఉంటాయి.

— వల్లిశ్రీ నాగరాజ్

## చామదుంపల కుర్మా

వస్తువులు: చామదుంపలు — పావుకిలో, టొమేటోలు 2, పెద్ద ఉల్లిపాయలు 6, చిన్న అల్లం ముక్క, వెల్లుల్లి రేకులు — 4, పచ్చిమిర్చి — 6

గరం మసాలాకి, ధనియాలు 2 టేబిల్ స్పూను, జీలకర్ర — టీ స్పూను, దాల్చిన చెక్క — చిన్న ముక్క, లవంగాలు — 2, యాలకులు — 2 మసాలా ఆకులు — 2, 3, గసగసాలు — టేబిల్ స్పూను

చేయు విధానం: చామదుంపలు ఉడకబెట్టి తోలు వలిచి నూనెలో ఎర్రగా వేయించాలి, ఉల్లిపాయలు కొబ్బరికోరాముతో కోరాలి గరం మసాలా, గసగసాలు, అల్లం, మిర్చి, వెల్లుల్లి రేకులు విడివిడిగా మెత్తగా నూరి పెట్టుకోవాలి బాణలిలో నూనెవేసి వేగాక మసాలా ఆకులు వేసి ఉల్లికోరు వేసి ఎర్రగా వేయించాలి దీంట్లో నూరిన మసాలా ముద్దలన్నీ వేసి ఎర్రగా వేయించాలి తర్వాత టమేటా ముక్కలు తగినంత ఉప్పు, పసుపు, అరగ్లాసు నీరుపోసి మగ్గనిచ్చి నీరు ఇగిరిపోగానే తీసి వేరే గిన్నెలోకి పెట్టుకోవాలి ఇది రొట్టెలకి, పూరీలకి అన్నంలోకి బాగుంటుంది

— ఎం. పి. రాణి






## కమ్ ఫర్ కాక్‌టైల్స్

మదరాసు కేటరింగ్ ఇన్‌స్టిట్యూట్ బార్ టెండర్ డిప్లొమా తో పాటు పెద్ద స్టార్ హోటల్‌లో అనుభవాన్ని కూడ గడించిన శ్రీ ఆర్. జగన్నాథ్ రాసిన ఈ ఆంగ్లపుస్తకంలో మధుపాన ప్రియులకి మరులుగొలిపే 33 రకాల కాక్‌టైల్ మిశ్రమాల తయారీ పద్ధతులని పొందు పరిచారు. కాక్‌టైల్ ప్రియులకి కరదీపిక లాంటి 48 పేజీల ఈ పుస్తకం వెల రు. 10 వి పి పి. ద్వారా రూ. 14. ప్రతులకు : రచయితపేర హోటల్ కాంధారీ ఇంటర్నేషనల్ విజయవాడ—10, లేక 4/13-బి ఆర్ సి. చర్చి స్ట్రీట్. పే— పల్లావరం, మదరాసు—43. లేదా హొరిజాన్ బుక్ సెల్లర్స్, 804, మౌంట్ రోడ్, మదరాసు—600002.

## యువరచయిత(త్రు)ల మహాసభలు

సాంస్కృతీ సమాఖ్య (యువ సాహితీ వికాస వేదిక) కడప జిల్లా విభాగం పక్షాన మార్చి నెలమొదటి వారంలో యువ రచయిత(త్రు)ల మహాసభలు నిర్వహించబడతాయి.

ఆధునిక సాహిత్యంలోని వివిధ ప్రక్రియలపై ప్రముఖుల ఉపన్యాసాలు, వర్ధమానుల చర్చలు, గోష్ఠులు, కథాకవితా సమ్మేళనం వుంటాయి. ఇవిగాక ప్రత్యేక ఆకర్షణలుగా మినీకవితా ప్రదర్శన, పుస్తక ప్రదర్శన, సాంస్కృతిక కార్యక్రమాలు వుంటాయి.

కడప జిల్లాలోని యువరచయిత(త్రు)లు ప్రతినిధులుగా, ఇతర జిల్లాలలోని యువ రచయిత(త్రు)లు సౌహార్ద ప్రతినిధులుగా విచ్చేసి మహాసభలను విజయవంతం చెయ్యవలసినదిగా సాంస్కృతీ సమాఖ్య కడపజిల్లా విభాగం అధ్యక్షులు శ్రీ రాధేయ, కార్యదర్శి శ్రీ తేజోమూర్తిగార్లు తమ సంయుక్త ప్రకటనలో తెలియజేస్తున్నారు.

యువ రచయిత(త్రు)లు తమ తమ పేర్లను తెలియజేస్తూ స్వంత చిరునామాల గల కవరుతో, కార్యదర్శి, సాంస్కృతీ సమాఖ్య 10—13 బెల్లంమండివీధి, కడప—516001 అన్న చిరునామాకు పంపి మహాసభల వివరాలను పొందవచ్చును.

## క్రాంతి కళానికేతన్

క్రాంతి కళా నికేతన్‌వారు కవితల సంకలనం వెలువరించాలని నిర్ణయించుకున్నారు. ఈ కవితా సంకలనానికి పదిలైనులు మించకుండా కవితలు వ్రాసి వీలైనంత త్వరగా పంపించవలెనని, ఇదివరకు ప్రచురించిన కవితలు కూడా ఇందులో ప్రచురణకు స్వీకరిస్తామని, కవితలని వి. వి. డి. రమేష్, క్రాంతి కళానికేతన్, గాంధీనగర్, యలమంచిలి—531055 అన్న చిరునామాకు పంపవలసిందిగా నిర్వాహకులు కోరుతున్నారు.

## రిజర్వ్‌బ్యాంక్ తెలుగు సమితి

రిజర్వ్ బ్యాంకు తెలుగు సమితివిజయదశమి ఉత్సవములు ఆంధ్రమహాసభ (బొంబాయి) ఆవరణలో జరిగినవి. ఈ సందర్భంగా 'రిజర్వాణి' అను గృహపత్రికను శ్రీ రామకృష్ణయ్య [భారత రిజర్వ్ బ్యాంకు డిప్యూటీ గవర్నర్] ఆవిష్కరించారు. శ్రీమతి రామకుమారి కూచి పూడి నాట్యం (భామా కలాపము) ప్రదర్శించి అందరిని ఆనంద పరచారు.

## డొంబివిలి ఆంధ్ర కళాసమితి

21 నవంబరు 1981న పార్వతిసదన్ నెం. 4. నెహ్రూ రోడ్డు, డొంబివిల్లి [ఈస్ట్]లో ఆంధ్ర కళాసమితి ప్రారంభోత్సవం జరిగింది. ఆహ్వానం అందలేదనుకోకుండా మనకు ఒక సమితి ఏర్పడిన దన్న ఉత్సాహంతో ఈప్రయత్నాన్ని విజయవంతం చేయవలసిందిగా డొంబివిల్లిపరిసర ప్రాంతాన ఉన్న తెలుగువారికి విజ్ఞప్తి, సభ్యత్వం, ఇతర వివరాలు పై చిరునామాకు వ్రాయవచ్చు.

## "కథాసాహితి"

13.12.1981 కాళీపట్నం రామారావుగారితో హైదరాబాదులోని సామాజిక చైతన్యంగల కథా రచయితలు కొంతమంది ఇష్టాగోష్ఠి జరిపారు.

మంచి కథని పెంపొందించేందుకు రచయితలకు ఒక వేదిక అవసరమని భావించి 'కథాసాహితి' అనే వేదికను ఏర్పాటుచేశారు.

ఈ వేదిక సామాజిక అవసరాలను, సమాజాభివృద్ధిని కాంక్షించే రచనలకు అండగా నిలుస్తుంది. పాఠకులలో ఉత్తమాభిరుచులను పెంచుతుంది.

ఈ లక్ష్యాల దృష్ట్యా కథాసాహితి వేదిక తరఫున కథ అనే బులెటిన్ వెలువరించాలనుకుంటున్నారు. పై లక్ష్యాలతో ఏకీభవించే రచయితలు సభ్యులుగా చేరాలని మనవి.

కథా రచయితలే కాక సంస్థలు, సానుభూతిపరులు తమ సహాయ సహకారాలు అందించి తెలుగులో మంచి కథలు వెలువడడానికి జరిగే కృషిలో పాలుపంచుకోవలసిందిగా కన్వీనరు శ్రీ జయధీర్ విజ్ఞప్తిచేస్తున్నారు. వివరాలకి కన్వీనరు, కథాసాహితి, 1—8—1 / 117, సూర్యానగర్, చిక్కడపల్లి, హైదరాబాదుకి రాయాలి.

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna**

రుచులూరించే 'ప్రియ'తో వినోద
యాత్రల కొక వినూత్నశోభ వస్తుంది.
పలురకాల కమ్మని రుచుల్లో 'ప్రియ'
పచ్చళ్ళు ప్రతిచోటా దొరుకుతున్నాయి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300,
650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

• మామిడికాయ • నిమ్మకాయ • టొమాటో
• అల్లం • గోంగూర • ఉసిరికాయ • చింతకాయ
• పండు మిరపకాయ • వంకాయ
తీపిరకాలు : • మామిడికాయ • అల్లం




**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004